# భావవీచికలు

## గిడుగు రాజేశ్వరరావు లలిత గేయాలు





స్నేహలతా ప్రచురణలు
ప్లాట్ నెం. 2-2-1105/1, ఫ్లాట్ నెం: 306
మూడో అంతస్తు, బాలాజీ ఆర్కేడ్
తిలక్‌నగర్, న్యూనల్లకుంట
హైదరాబాద్- 500 044



**BHAVAVEECHIKALU** a collection of lyrics by
**SRI GIDUGU RAJESWARA RAO**

First Edition : May, 2000

Title concept : Sri Cheekolu Sundaraiah

Publishers : **Snehalatha Publishers,** Flat No. 306, III Floor, Balaji Arcade, Tilak Nagar, New Nallakunta, Hyderabad - 44.

Price : **Rs. 40/-**

**Printers :** Sri Uday Printers, YMCA, Narayanguda, Hyd - 29. ☎ : 7568128

For Copies : **Smt. P. Snehalatha Murali** Flat No. 306,III Floor, Balaji Arcade, Tilak Nagar, New Nallakunta, Hyderabad - 44.

**Visalandhra Book House,** 4-435 Vigyan Bhavan, Bank Street, Hyderabad,

**Navodaya Book House,** 3-3-865 Opp : Aryasamaj, kachiguda, Hyd - 27.



లలిత సంగీత ప్రియులకు లాలిపాడి
ఏ మరచి జారిపోయావు ఎందుకయ్యా ?
రాగ సుధలూరు సాలూరు రాచవాడ !
చంద్రుడికి నూలు పోగిది - చాలదయ్యా!

ఒక శతాబ్దిని శాసించి, కమ్మని పాటలందించి గంధర్వలోకానికి
తరలిపోయిన సాలురివారి స్మృతికి.

# గేయాలక్రమం

1988 అక్టోబరు 25 న జరిగిన నాలుగో రంజని- కుందుర్తి అవార్డు ప్రదాన సభలో ప్రసంగిస్తోన్న అధ్యక్షులు గిడుగు రాజేశ్వరరావు, సుధామ, శీలా వీర్రాజు, ఆచార్య నాయని కృష్ణకుమారి, ఆరుద్ర, జ్వాలాముఖి, ఆశారాజు, మంజుశ్రీ తదితరులను చూడవచ్చు.



1988 మే 13న ప్రసిద్ధ రచయిత పురాణం సుబ్రహ్మణ్య శర్మ పాల్గొన్న సభలో
రచయిత గిడుగు




989 ఫిబ్రవరి 16న 'రంజని' రజతోత్సవాల్లో ''గొంతులు విగిర్చాయి'' ఆవిష్కరణ సభలో ఇసుకపల్లి దక్షిణామూర్తి, నందివాడ భీమారావు, జ్ఞానపీఠ సచ్చిదానంద రౌత్రాయ్ లతో గిడుగు.



1989 ఆగస్టు 14న 'రంజని' సభ తదనంతరం కాశీపట్నం రామారావు, నందివాడ భీమారావు, చీకోలు సుందరయ్య, ఆశారాజు, ఇతర 'రంజని' మిత్రులతో గిడుగు.



1991 జనవరి ఎనిమిదో తేదీన 'గిడుగు రాజేశ్వరరావు కథలు' ఆవిష్కరిస్తోన్న ఆచార్య సి.నారాయణరెడ్డి.



‘గిడుగు రాజేశ్వర[illegible]థయు’ ఆవిష్కరణ తర్వాత రచయితను సత్కరిస్తోన్న ఆచార్య సి.నారాయణ రెడ్డి



[illegible]దవీ [illegible]రమణ తర్వాత 1991 జులై 3న గిడుగు ను సత్కరిస్తున్న ప్రముఖ రచయిత డా.[illegible]డమూరి వీరేంద్రనాథ్



1992 జులై 31న 'రాగవీచికలు' కావ్యం ఆవిష్కరిస్తోన్న ఆచార్య సి.నా.రె. గిడుగుతో పాటు కె.వి.రమణ ఐ.ఏ.ఎస్, శ్రీరంగం గోపాలరత్నం తదితరులను చూడవచ్చు.




'రాగవీచికలు' ఆవిష్కరణ సభలో గిడుగును సత్కరిస్తోన్న ఆచార్య సి.నా.రె, కె.వి.రమణ.



1995 జూన్ 16 న జరిగిన 'కాళిందిలో వెన్నెల' ఆవిష్కరణ సభలో
గిడుగు ను సత్కరిస్తోన్న కె.వి.రమణా, ఆచార్య సి.నా.రె.



1994 అక్టోబరు రెండో తేదీన రాజమండ్రిలో ఆచార్య బేతవోలు రామబ్రహ్మం నుంచి
'రాగవీచికలు' కావ్యానికి 'గరికిపాటి [redacted]రు సాహిత్య పురస్కారం' అందుకొంటోన్న గిడుగు



1997 జనవరి 30న హైదరాబాద్‌లో జరిగిన రచయిత్రుల గోష్ఠిలో పాల్గొన్న రచయిత్రులతో గిడుగు



1999 డిసెంబరు 3న జరిగిన 'రంజని' సభలో రావు బాలసరస్వతీదేవితో గిడుగు



దుర్గాబాయ్‌దేశ్‌ముఖ్ మీద రాసిన గీతాలకు ఎన్.సి.ఇ.ఆర్.టి. నుంచి ఉత్తమ స్క్రిప్ట్ రచయితగా గిడుగు పొందిన ప్రశంసా పత్రం



# 8th Children's Educational Audio Video Festival

*This is to certify that*

Shri. Gidugu Rajeswara Rao

*has been awarded for*

Script Writer

*for the programme*

Durgabai Deshmukh *in the category* 2nd. Best Audio (5-14 yrs.)

*at this festival organized from 28th-30th November, 1998*
*at SIET, Hyderabad*

*Festival Director*



*Joint Director*
CIET

**Central Institue of Educational Technology**
**National Council of Educational Research & Trainin**
**NEW DELHI**

కుటుంబ సభ్యులతో గిడుగు రాజేశ్వరరావు



గిడుగు రాజేశ్వరరావు శ్రీమతి లలిత





లలిత గాన సరస్వతి
**శ్రీమతి రావుబాలసరస్వతీదేవి**

# ప్రకృతి ప్రేమికుడు రాజేశ్వరరావు

పాతపాటల ప్రస్తావన వచ్చినప్పుడు గిడుగు రాజేశ్వరరావుగారు అవలీలగా ఆరు దశాబ్దాలు వెనక్కి వెళ్ళిపోతారు. కనకతారలో సూరిబాబు పాటలు, గృహలక్ష్మిలో కన్నాంబ, నాగయ్య పాటలు, కపిలవాయి వారి గ్రామఫోను రికార్డులు, నేనూ సాలురి రాజేశ్వరరావుగారు ఆలపించిన తొలినాటి యుగళగీతాలు గుర్తుచేస్తారు. అలాగే అటు హిందీ చిత్రాలలోని కె.సీ.డే, సైగల్, పంకజ్‌మల్లిక్, కానన్‌దేవి, ఖుర్షీద్, గీతారాయ్, నూర్జహాన్ వంటి గాయనీ గాయకుల పాటలు-వారివారి ప్రత్యేక బాణీలు చర్చకు వస్తాయి. గంటలు నిముషాల్లా దొర్లిపోతాయి.

మాటల సందర్భంలో నేను H.M.Vవారు రికార్డు చేసిన భక్తకుచేల నాటకంలో కుచేలుడి కుమార్తె గా పాత్ర పోషించి ఆరేళ్లప్రాయంలో ఒక పాట పాడాను అన్నాను.

"అలాగా ? ఆ పాట నేను వినకుండా ఉండనే. ఏదీ పాడండి" అని అనునయించారు."ఆకలి సహింపజాలనె ఓజననీ " అని నేను అనేలోగానే "పాలు పెరుగునడుగలేదు, పాయసములనడుగ లేదు, పట్టెడన్నమువకు నైనా పెట్టిపుట్టలేదే ... " అని చరణమంతా చెప్పేశారు. అంత పిచ్చి ప్రేమతో చిన్నతనం నుంచీ విన్న

పాటల్ని తూ.చ. తప్పక జీర్ణించు కోవడం అరుదైన విషయమే మరి.

ఇది వరలో "రాగ వీచికలు " ప్రతిని నాకు ఇచ్చినప్పుడు ఆ పాటలు, వాటి వెనుక ఉన్న నేపథ్యం చదివాను. వారి తల్లిపాడేవారట. శ్రీమతి పాడతారు. కుమార్తె వీణవాయిస్తుంది, పాడుతుంది, పాటలకు స్వరం కూరుస్తుంది కూడా. ఇక మనవరాలు, మనవడూ తబలా వాయిస్తారట. ఆ కుటుంబ నేపథ్యంలో పుట్టిన పాటలు సరళంగానూ తాళానికి ఒదుగుతూనూ ఉండడంలో ఆశ్చర్యంలేదు.

ప్రకృతిని నిశితంగా పరిశీలించి ఆరాధించే గేయకర్త రాజేశ్వరరావుగారు. శిశిర రుతువులో కూడా చిత్రమైన అందాన్ని చూడగల తాత్త్వికదృష్టి, భావుకత ఉన్నవారు. ఆ పాటలలో సరికొత్త అందాలు సంతరించుకుని గోదారి కొండమల్లెలు తురుముకుంటూ ఉరుకుతుంది. నిన్న మొన్నటి దాకా నిరాశగా ఉన్న ఎలమావి ఉన్నట్టుండి వన్నెలు తొడిగి పలుకరిస్తుంది. సంగీతం అంటే వారికున్న అభిరుచి ప్రతి పాటలోనూ సుమారుగా వ్యక్తమౌతుంది. నేను ఒకొక్కటీ వివరించడం కన్నా మీరే ఆ పాటలు చదివి ఆనందిస్తారనీ, గాయనీ గాయకులు పాడి ప్రోత్సహిస్తారనీ, ఆశిస్తూ సంగీతాన్ని ఒక చిన్న కాటేజి ఇండస్ట్రీలా ప్రోది చేసిన గిడుగు రాజేశ్వరరావుగారి కుటుంబసభ్యులను అభినందిస్తూ ఈ "భావవీచికల" కు నాలుగు మాటలు వ్రాస్తున్నందుకు సంతోషిస్తున్నాను.

సికింద్రాబాద్ — రావు. బాలసరస్వతీదేవి.

6-5-2000

# ఆలాపన

కమ్మగా గళం విప్పి పాడుకోగలగడం ఒక అమూల్యమైన వరం. అలాటి పాట విని కనులు మూసుకొని ఆస్వాదిస్తూ ఆత్మానందం పొందడం కూడా అపూరూపమైన అనుభవ విశేషమే . ఒక పాట కూర్చిన గేయకర్త ఆ పాట జనరంజకమై పదిమంది పాడుకుంటూ వుంటే చెవిని పడినప్పుడు పొందే తృప్తి కూడా అనుభవైక వేద్యమే. పాటతో ఏ విధంగానూ ముడిపడని బ్రతుకు నిజంగా నిస్సారమే అన్న భావన ఒక్కోసారి కలుగుతుంది. పాట అన్నది లేకుంటే ఈ బ్రతుకు ఎంత బరువుగా ఈడ్చేవాడో కదా మానవుడు అని అనుకుంటూ వుంటాను.

శిశువును హాయిగా నిద్ర పుచ్చాలంటే పాట.

ఇలవేలుపుని ప్రసన్నంగా మేలు కొలపాలంటే పాట.

శ్రమ భారాన్ని కాసింత తగ్గించు కుందుకు పాట.

ఒక తియ్యని సునిశిత భావాన్ని సుకుమారంగా హృదయానికి హత్తుకునేలా తెలపడానికి పాట.

జాతీయ భావాన్ని ప్రోది చెయ్యడానికి పాట.

క్రౌర్యం హింసా పెరిగిపోతున్న జనారణ్యంలో మానవతావిలువను ప్రసరించడానికి పాట.

నిరామయంగా ప్రకృతిని కీర్తించడానికి పాట.

స్వర సమ్మేళనమే రాగం.

రాగాన్ని శ్రావ్యంగా చెవికి అందించేది తాళం. ఈ రెంటి బలంతో చక్కని భావం వెల్లి విరిస్తే అది పాట. భావరాగలయాన్వితం పాట స్వరూపం. వినే చెవి వుంటే సర్వసృష్టిలోనూ అంతర్లీనంగా వినవచ్చేది సంగీతం. బ్రతుకులోని యాంత్రికతను తగ్గించి పండిత పామరుల్ని కూడా తలలూచేలా చేయగలిగేది లలిత

సంగీతం. " సంగీతజ్ఞానముా భక్తి వినాసన్మార్గము గలదే మనసా !" అంటాడు త్యాగరాజస్వామి. ఈ సందర్భంగా ఒక సినిమా పాటలోని చరణం కూడా నాకు గుర్తొస్తుంది. నా చిన్నతనంలో విన్న సినీ సంగీతంలో ఒక్కో పాట ఒక మహాకావ్యం లా ఉండేది మరి.

రాగములో అనురాగము కలిపి
త్యాగామృతమున జీవము నిలిపి
మానవ లోకము మధురము చేసే
మంగళ గీతము గానముచేసే-
వారే ధన్యులుగా అంటాడా గేయ కర్త.

కాసింత తీరిక దొరికితే కూనిరాగాలు తీస్తూ విశ్రమించేది మా అమ్మ. నా బాల్యంలో కపిలవాయిరామనాథ శాస్త్రి గారి పాటలు జనరంజకంగా గ్రామఫోను రికార్డులలో వినవచ్చేవి. అయితే ఆ పాటలు చాలా వరకూ నాటకాలఫక్కీలోనే సాగేవి. నాటకాలలో ప్రధానమైన వాద్యం హార్మోనియమ్. హార్మోనియంతో పాడి పాడి స్వరాలను విడగొట్టినట్టు పాడే విధానం ఎక్కువగా చెవికి సోకేది. సినిమాలు, రేడియో ప్రజాజీవితాన్ని ప్రభావితం చేస్తున్న తరుణంలో అటు మరాఠీ సంగీత పరిమళాన్నీ, ఇటు వంగగాయకుల గాత్ర సౌకుమార్యాన్నీ జీర్ణించుకుంటూ సరళ సుందర శైలిలో తెలుగు లలిత సంగీత సరస్వతికి తొడుగులు కూర్చిన ప్రసిద్ధులు ఎందరో ఉన్నారు. వారిలో సాలూరి రాజేశ్వరరావు, రావుబాలసరస్వతీ దేవి, టంగుటూరి సూర్యకుమారీ ముఖ్యులు. రెండు చింతల సత్యనారాయణ, సూరిబాబు, నాగయ్య, రఘురామయ్య - ప్రభృతులు భక్తి రస ప్రధానమైన పాటల్ని ప్రత్యేక శైలిలో నడిపి విశేషమైన ఆకర్షణ పాటకు సమకూర్చారు. అలాటి పాటలు చిన్నతనం నుంచీ విన్నకారణంగా నేమో నాకూ పాటలు కూర్చాలన్న కోరిక కలిగేది.

"రాగవీచికలు" అన్న పేరుతో నే కూర్చిన లలితగేయమాలికను త్యాగరాయగానసభలో జులై 1992లో ఆవిష్కరించిన వేళావిశేష మెటువంటిదో

చెప్పలేను. ఆ పుస్తకానికి తొలి పలుకు నందించిన శ్రీ రంగం గోపాల రత్నం గారు ఈనాడు లేరు. కానీ సద్యస్ఫూర్తితో ఆ సభలో ఒకటి రెండు పాటలు రాగవీచికలలోనివి ఏరి పాడి శ్రోతల్ని రసార్ణవంలో ఓలలాడించారు. ఆచార్య సి. నారాయణరెడ్డిగారు - నే పిల్లల కోసం కూర్చిన పాటలను ప్రత్యేకంగా ప్రశంసించిన నాటి సాయంత్రం నా ఆనందానికి అవధి లేదు. ఆ పుస్తకం లోని పాటలన్నీ అటు ఆకాశవాణిలోనూ ఇటు దూరదర్శన్‌లోనూ, పాఠశాలల్లోనూ, దృశ్యశ్రవణ విద్యా వికాస కేంద్రంలోనూ, పాటల పోటీలలోనూ, ప్రైవేట్‌గా వేసిన ఆడియో కేసట్లలోనూ జనాదరణ పొందినపుడు నాకు ఎంతో సంతృప్తి కలిగింది. 'రాగవీచికల'కు డాక్టర్ గరిక పాటి సాహిత్యపురస్కారం లభించడం నాకు సంతోషం కలిగించింది.

ఆ తర్వాత నే కూర్చిన పాటలన్నీ ఇంకో సంపుటిగా ప్రచురించమని నన్ను అభిమానించిన గాయనీ గాయకులు అడుగుతూ వచ్చారు. నే బాలబాలికల కోసం కూర్చిన పాటలు, ప్రసారమైనవీ కానివీ - పుస్తక రూపంలో బాలసాహిత్యానికి సంబంధించిన సంస్థ పరిశీలనలో ఉన్నందున వాటిని ప్రస్తుతానికి విడిచి పెట్టి - యువతీ యువకులు పాడుకొందుకు నే కూర్చిన పాటలను - ఈ "భావవీచకలు" అన్న సంపుటిలో మీ ముందుంచుతున్నాను.

ఇందులో తొలి ప్రార్థన గీతం వెనుక చిన్న ఉదంతం క్లుప్తంగా చెప్పక తప్పదు. "రాగవీచికలు" ఆవిష్కరణ సభకు వచ్చి గేయ సంపుటిని కొని చదివిన ఒక వ్యక్తి నన్ను కలిసి - పాటలైతే బావున్నాయి కానీ మీరు భక్తి గీతాలు(Devotional music) ఏమీ రాయలేదే అని కారణం అడిగాడు. వైయక్తికంగా నాజీవన సరళిలో నేను నిర్గుణోపాసకుడిగానే సత్యదర్శనం చేసే ప్రయత్నం నాది. కొన్ని సున్నితమైన భావాల ప్రసారానికి ఆలంబనగా రాధాకృష్ణులను ప్రతీకలుగా చేసుకున్నాను. కానిDevotional music రాయలేదు-" అన్నాను. " సంతోషం. మాకో సంస్థ ఉంది. సర్వాంతర్యామి అయిన విశ్వ శక్తిని కీర్తించే ప్రార్థన గీతం రాయండి" అన్నాడు. అందరూ పాడుకునే సౌలభ్యంతో ఒక ప్రార్థన గీతం రాశాను.నాకు ఆ గీతం బాగున్నట్టు అనిపించినా,

ఆవ్యక్తి మళ్లా నాకు కలవడం తటస్థించనే లేదు. ఇక నేనా పాటను రేడియో స్టేషన్‌కు పంపించాను. అప్పట్లో (మే, 1993) ప్రధాని పాల్గొన వలసిన ఒక ముఖ్య సదస్సుకు ఆకాశవాణి సంగీత కార్యక్రమం నిర్వహించ సంకల్పించి - ఆపాటను ఎంపిక చేసి రికార్డింగ్ చెయ్యడం జరిగింది. కారణాంతరం వల్ల ఆ సదస్సు జరగక - భక్తి రంజనిలో ప్రసారం అయింది.

దానినే ఈ సంపుటిలో తొలి పాటగా ప్రచురించాను. విశ్వాంతర్గత శక్తిగా ఊహించిన సత్యరూపానికి స్త్రీ పురుష భేదమెందుకని - పునరాలోచనతో విభునకిదె అభివందనం - అన్న శబ్దాలస్థానంలో - విభవమున కభివందనం అని మార్పుచేశాను. ఆ తర్వాత అభిమానుల కోరిక మీద కొన్ని ప్రార్థనా గీతాలు రాయక పోలేదు. ఇందులో కొన్ని సంపుటీకరించాను. అయితే బుద్ధం శరణం గచ్ఛామి, భాసరజ్ఞాన సరస్వతి వంటి సంగీత రూపకాలు దూరదర్శన్ కోసం కూర్చినవి. ఈ సంపుటిలో చేర్చక కేవలం యువతీ - యువకుల - పాడుకునే వీలున్న పాటలనే చేర్చాను.

వెయ్యి గొంతులు విన్నా సున్నితమూ సుస్పష్టమూ సుమధురమూ అయిన ఈ గళము రావు బాలసరస్వతీదేవి గారిదని గుర్తించగల స్వరం వారిది. వారు నా ఈ భావవీచికలకు నాలుగు వాక్యాలు తొలి పలుకుగా వ్రాయడానికి అంగీకరించడం నా అదృష్టంగా భావిస్తున్నాను.

నాచేత ఎన్నెన్నో పాటలు రాయించి మంది మధ్య పడవేసిన శ్రీ సి.బి.యస్. వెంకటరమణ I.A.S కమిషనర్ కుటుంబసంక్షేమం, దూరదర్శన్ టెలిస్కూల్, ఆకాశవాణిలోని పెద్దలకూ, నిర్మాతలకూ, సంగీత దర్శకులకూ గాయనీ గాయకులకూ, ప్రైవేట్ కేసెట్లలో వినియోగించిన వారికీ- వినయపూర్వక కృతజ్ఞతాభి వందనాలు అర్పిస్తున్నాను.

ఇందులోని పాటలన్నిటినీ ఓపికగా వర్గీకరించి, అందంగా పుస్తకరూపకల్పన చేసి, భావవీచికలు అని నామకరణం చేసిన మిత్రులు శ్రీ చీకోలు సుందరయ్యగారికి కృతజ్ఞతలు.

హైదరాబాద్ - గిడుగు రాజేశ్వరరావు

**5-5-2000**

# ప్రేమమూర్తికి వందనం

కడలి తానై పుడమితానై
గగన తలమున కాంతితానై
విశ్వమంతా విస్తరించిన
విభవమున కభివందనం //క//

గతులు తప్పని గ్రహబలంతో
కదలిపోయే జగతి కావల
నిత్యనూతన రీతి వెలిగే
సత్యమున కభివందనం //క//

ప్రాణికోటికి జీవరాశికి
పల్లవించే పాదపములకు
సకల సృష్టికి శ్వాసతానై
చలగు శక్తికి వందనం //క//

ఉరికి పడు జలపాతములతో
పరవశించే వలపుతానై
ప్రీతితో లోకాలనేలే
ప్రేమమూర్తికి వందనం //క//

(ఆకాశవాణి సౌజన్యంతో)

# వాణీస్తుతి

మము బ్రోవగదే
మంజు భాషిణి
వీణాపాణీ
శ్రీవాణీ ! // మ //

సర్వ కళలకా
ధారము నీవై
సంరక్షించే
వేద విహారిణి // మ //

బ్రాహ్మి - సురుచిర
సుందర రూపిణి
పాపహారిణీ
పుస్తక ధారిణి // మ //

విద్యాసాగరి !
విశ్వవినోదిని
తేజస్విని అ
జ్ఞాన నాశనీ .... // మ //

(దూరదర్శన్ సౌజన్యంతో)

# భాసర జ్ఞాన సరస్వతి

కరుణ గనవె మము
    జ్ఞాన సరస్వతి
వాసర క్షేత్ర సు
    వాసిని భారతి ! // క //

సైకత శోభిత
    సుందర రూపిణీ
వీణాపాణీ
    విశ్వవిహారిణీ // క //

పాపహారిణీ
    పుస్తకధారిణీ
వ్యాస ప్రతిష్ఠిత
    వాగనుశాసని // క //

(దూరదర్శన్ సౌజన్యంతో)

# శర్వాణీ!

సర్వమంగళా ! శర్వాణీ
ఉర్వి జనుల సంతాపము తీర్పవె
మృత్యునివారిణి సత్యస్వరూపిణి
సౌఖ్యప్రదాయిని ! సనాతనీ //స//

భవభయహారిణి పరమపావనీ
భక్తకోటి హృదయాంత ర్వాసిని
నానాజీవన నాటక కారిణి
నయనానంద మనోజ్ఞరూపిణీ ! //స//

నిరతము నీ పద యుగళము కొలిచే
వరము నీయవే పాపవినాశని
కాత్యాయని కరుణించవె జననీ
కల్యాణీ శంకర సమ్మోహిని //స//

(దూరదర్శన్ సౌజన్యంతో)

# అయ్యప్పస్తుతి : (మకరజ్యోతి)

కొండ కొచ్చిన వారమూ
కోరిపిలిచిన వారమూ
అలడచేరిన భక్త కోటిని
ఆదుకొనవే అయ్యప్పా ! // కొం //

ముడుపులను చెల్లింప నిష్ఠగ
మురిసి వచ్చిన వారము
మకర జ్యోతిని చూసితనియగ
మనసు నిల్పిన వారము // కొం //

మాలధారణ చేసి ఇంటిని
మరచి వచ్చిన వారము
శరణమయ్యప్పా శరణమనినీ
దరిని నిలచిన వారము // కొం //

(వినోద్ బాబుగళంలోకృష్ణ నీరజ్ సంగీత సారథ్యంలో
మాగ్నా సౌండ్ సౌజన్యంతో)

# అయ్యప్పకు మేలుకొలుపు

ఆర్తజన రక్షకా ! మేలుకో
హరిహరాత్మజ, ఇక మేలుకో // ఆ //

విరి తావి శ్వాసతో చిరు తమ్మెరలు వీచె
శబరగిరి శిఖరాన శారికలు కీర్తించె // ఆ //

ఈరేడు లోకాలు నీకై నిరీక్షించె
దశదిశల అజ్ఞాన తమసమ్ము చెదరగా // ఆ //

భక్తజన సులభ ఈ పాలుమాలిక లేల
ఓంకార రూప నీ యోగ నిద్రను విడుము // ఆ //

కొండకోనలు దాటి గొంతెత్తి పిలిచి నీ
అండ చేరిన వారి నాదుకోవయ్యా // ఆ //

(ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యాం గళంలో
కృష్ణ నీరజ్ సంగీత సారథ్యంలో
మాగ్నా సౌండ్ సౌజన్యంతో)

# అయ్యప్పకు - ఆత్మార్పణ

ఈ దేహమే ప్రమిదైతే
నీవే నా వెలుగైతే
అయ్యప్పా స్వామి ఎందుకింక
ఆరాటము నాకు ॥ ఈ ॥

ఈ తనువే సుమమైతే
నెత్తావివి నీవైతే
అయ్యప్పా ! స్వామీ ! ఎందుకింక
ఆరాటము నాకు ॥ ఈ ॥

బ్రతుకే ఒక పదమైతే
స్వరమాధురి నీ వైతే
అయ్యప్పా ! స్వామీ ! ఎందుకింక
ఆరాటము నాకు ॥ ఈ ॥

ఈ జీవిత సర్వస్వము
నీ విచిత్ర విన్యాసము
అయ్యప్పా ! స్వామీ ! ఎందుకింక
ఆరాటమునాకు ॥ ఈ ॥

(ఎస్.పి. శైలజ గళం నుంచి కృష్ణ నీరజ్ సంగీత సారథ్యంలో
మాగ్నా సౌండ్ సౌజన్యంతో)

# గురుపూజ

గురుదేవుని వినయంతో
        కొలుచు సంప్రదాయం
సనాతనపు భారతీయ
        సంస్కృతి కది మూలం        // గురు //

విద్యాదానమె ఇలలో
        విశిష్టమని నమ్మి మనకు
చదువూ సంస్కార మిచ్చి
        సహజీవన పథము జూపు        // గురు //

అజ్ఞానపు చీకటిలో
        విజ్ఞానపు వెలుగు నింపు
పరబ్రహ్మ స్వరూ పమని
        మనమంతా విశ్వసించు        // గురు //

వెన్నవంటి మనసు లున్న
        పిన్నలలో అనురాగం.
సమభావం మేలుకొలిపి
        సమైక్యతను సాధించే        // గురు //

గతమునకూ వర్తమాన
        కాలమునకు వారధిగా
భరత జాతి హృదయానికి

ప్రతీకగా నిలిచి వెలుగు // గురు //
జనజీవన వాహినిలో
చైతన్య స్రవంతి కలిపి
సౌశీల్యమె విశ్వశాంతి
సాధనమని బోధించిన // గురు //

వసిష్ఠాది మహామునులు
వరశంకర గురుపాదులు
అల రవీంద్ర రాధాకృ
ష్ణులు వెలసిన దేశంలో // గురు //

(ఆలిండియా రేడియో హైదరాబాదు - సెప్టెంబరు, 1996 )

# ఆదిశక్తి - అపరాజిత

ఆదిశక్తి ! అపరాజితవని నీ
అండకోరితిమి బ్రోవగదే
ఆశ్రితజన సంరక్షిణి వని దరి
జేరి పిలిచితిమి చూడగదే // ఆ //

నిన్ను నమ్మిసేవించిన వారికి
ఇహపర చింతన లేదుగదే
సన్నుతించితిమి జాలము చేయక
విన్నపములనాలింపగదే // ఆ //

ఆదరించి మమ్మరమర చేయక
ఆర్తిని దీర్చిన చాలుగదే
అఖిలాండేశ్వరి ! దుర్గా ! చండీ
అన్ని రూపములు నీవి గదే // ఆ //

భద్రకాళి ! కాత్యాయని ! శంకరి !
పాలితులము మమ్మేలగదే
నీ వే దిక్కని నెరనమ్మిన మా
కామితముల వే దీర్పగదే ! // ఆ //

(దూరదర్శన్ సౌజన్యంతో)

# ఈశ్వరీ !

అన్నిరూపములు నీవై వెలిగే
అఖిలాండేశ్వరి – ఈశ్వరీ !
ఆశ్రితజన సంరక్షిణివని – నిను
ఆశ్రయించితిమి కావగదే // అన్ని //

పర్వదినములివి – ప్రసన్నమతివై
వరములమితముగ వర్షించీ
భక్తజనుల పరిపాలన చేయగ
మంచి తరుణమని ఎంచితిమీ. // అన్ని //

ఆదిశక్తివని – అపరాజితవని
వేదమంత్ర సమ్మోదివనీ
నెరనమ్మితిమిక అరమర సేయక
కరుణనేలవే కపర్దినీ // అన్ని //

సన్నుతించితిమి చనువున ఇక మా
విన్నపముల వినిపించితిమీ
నిన్నువినా ఇల దిక్కెవరే –ఆ
పన్నుల మొరనాలింపగదే – // అన్ని //

(దూరదర్శన్ సౌజన్యంతో)

# సర్వలోకవ శంకరీ

సర్వలోక వశంకరీ మహి
　　　　షా సురాధమ సూదనీ !
సాధు జన సంరక్షిణీ మ
　　　　మ్మాదుకొనవె మహేశ్వరీ ! //స//

సత్యజ్ఞాన స్వరూపిణీ –శర
　　　　ణా గతావని ! పావనీ !
సామగాన వినోదినీ – నీ
　　　　శరణువేడితి మీశ్వరీ ! //స//

అభయహస్తము జూపి మముగని
　　　　అష్ట సంపద లీయవే
ఆలసింపక కల్పతరువై
　　　　ఆర్తి తీర్చవె శంకరీ ! //స//

భక్త జన చింతామణీ భవ
　　　　భంజనీ శివరంజనీ
పాపనాశని నీ కటాక్షము
　　　　భక్తి వేడితి మియ్యవే //స//

(దూరదర్శన్ సౌజన్యంతో)

# భవసాగర తరణం

భవసాగర తరణమునకు
భద్రమైన నావ
మెహరుని నామస్మరణమె
అహమునార్చు త్రోవ // భ //

తాపత్రయ దావాగ్నులు
దరిచేరని కోట
పరమాత్ముని నిత్యముగను
పచ్చని పూదోట // భ //

సప్తవర్ణ జయపతాక
అందించిన వరము
సకల ధర్మ సారములను
సాధించిన మతము // భ //

నవజీవన పథము తెలిపి
నడుపుట ఒక లీల
మౌన ముద్రతోనె సౌఖ్య
పథము చూపు హేల // భ //

# మెహరు నడిపే పడవ

అవతార పరుషుడు
మెహరు నడిపే పడవ
అందరికి చోటిచ్చి
ఆదరిస్తుంది. // అ //

ఆకాశ మార్గాన
హరివిల్లులా తేలు
ఏడురంగుల కేత
నము ను చేపట్టి // అ //

ధనములక్కర లేదు
దర్పమక్కర లేదు
ఆడంబరాల తో
అవసరమె లేదు // అ //

అహమన్నదే మరచి
ఆర్భాటము లను విడచి
మానవుడి సేవలో
మాధుర్య మెరిగితే // అ //

# మెహరుని నామమే మేలుకదా !

భక్తకోటి ఆ
రాటము తీర్చగ
మెహరుని నామమే
మేలు కదా ! ॥ భ ॥

సురుచిర రూపము
సుందర హాసము
సదమల హృదయము
చాలుకదా ! ॥ భ ॥

అహము విడచి ఆ
డంబర మెరుగని
ఆత్మానందమె
మతము కదా ! ॥ భ ॥

సత్యము, ప్రేమా
సర్వ సమర్పణ
పరమాత్మునికి ని
వాళి కదా! ॥ భ ॥

సేవలో నె పరి
పూర్ణత పొందే
చక్కని మార్గమె
తెలిపె కదా ! ॥ భ ॥

చిత్రమైన తన
జీవితమే ఒక
మతమని జనులకు
చూపె కదా ! ॥ భ ॥

# రాధామాధవం

ఊదరా ఇంకొక్కసారి – మాధవా !
లేదురా ఎన్నడీ హాయి. ॥ ఊ ॥

వేణువును వినగానె
వినువీధి నా తనువు
తెలిమబ్బు పింజలా
తేలినట్లనిపించు ॥ ఊ ॥

దిక్కులను పాదాల
త్రొక్కిపైపై కెగసి
ఉయ్యాల గగనాన
ఊగినట్లనిపించు ॥ ఊ ॥

ఇంద్ర జాలమదే మొ
ఎదలోన సుధలూరి
అతిలోక సౌందర్య
మందినట్లనిపించు ॥ ఊ ॥

నన్ను నేనే మరచి
నా ఉనికినే విడచి
విశ్వమే నేనన్న
వింతభావన కలుగు ॥ ఊ ॥

(ఆకాశవాణి సౌజన్యంతో)

# ఘనశ్యాముడు లేని రేయి

గడచిపోయె రేయంతా
ఘనశ్యాముడురాకనే
కలవరాన నా కంటికి
కునుకన్నది లేకనే //గ//

ఒక్కొక్కటి వినువీధిని
చుక్కలన్ని లెక్కిస్తూ
కానరాని చీకటిలో
కనుచూపును సారిస్తూ //గ//

నిలువెల్లా వేడి వేడి
నిట్టూర్పుల రగిలిస్తూ
వెతల దేలి నిదుర మాలి
వెర్రిగ ఈ వాకిటనే //గ//

మాట మరచెనో ఏమరు
పాటు కలిగెనో ఎరుగక
తూరుపు దిశ తొలి వెలుగుకు
తొట్రుపాటుతో బేలగ //గ//

యుగళగీతం

# మధురోహల ఊయల

మధురోహల ఊయలలో
ఊగెద మీ రేయి
జగమంతా మనదేనని
దిగంతాల చాటి // మ //

కారుమబ్బునేనై జల
తారు మెరపు నీవై - ఆ
నింగినుండి నేలవాలి
చంగున దివిపైకి తేలి // మ //

పాలపుంత నీడ జేరి
నెలవంకకు చేయిసాచి,
తెలిమబ్బుల జాడలలో
తొలి వలపుల సోలి సోలి // మ //

మింట నాడి పాడిన మన
జంటను క్రీగంట చూసి
నీరదాల వెనుక జేరి
తారావళి సిగ్గిలగా // మ //

# వెనుకటి ఆరోజులు

ఇక మళ్ళీ రావుకదా
వెనుకటి ఆ రోజులు
ఎదనిండా సుధలు కురిసి
విరబూసిన మోజులు // ఇ //

కష్టాలను నవ్వులతో
కలబోసిన వలపులు
పొలయలుకల ఓదార్పుల
పొలుపెక్కిన తలపులు // ఇ //

నిదుర మరచి ఒకరి కొకరు
నిట్టూర్చిన రాత్రులు
చేయి చేయి గీలించిన
చిత్రమైన యాత్రలు // ఇ //

నింగీ నేలా కలసే
నీడల జాడల కోసం
ఆరాటంతో సాగిన
ఆ తియ్యని అడుగులు // ఇ //

# నీ రూపమే మంత్రించెరా

నీ రూపమే నన్ను మంత్రించెరా
నీవు నేనను మాట మరిపించెరా - ॥ నీ ॥

ఈ రేడు లోకాలు నీ కనులు వెలుగ
వెలుగులో వెన్నెలై నే కరగు వేళ ॥ నీ ॥

నీలి మబ్బుల కదల నీ సోయగాలు
నెమలి పురి విప్పితే నీ జ్ఞాపకాలు ॥ నీ ॥

నీలాటి రేవులో నీ మురళి పాట
వెన్న తీసే వేళ - వెనుక నీ మాట ॥ నీ ॥

# యుగళగీతం

నాపాటకు పల్లవిగా
నాతోటకు ఆమనిగా
ఈ ఎదలో స్పందనగా
మేలు కొలుప రావె చెలీ ! // నా //

అతిశయోక్తి లేని కవిత
అవనిలోన దొరుకునా
నీ విచిత్ర కల్పనలను
నేను నమ్మవచ్చునా ? // నా //

నీ కను కొలకుల మాటున
నీలి నీడ లేలనే
నా మాటలలోని నిజం
నమ్మవేలనే చెలీ ! // నా //

నీ మాటే నిజమైతే
నీవు నేను ఒకటైతే
మన బ్రతుకేయుగళ గీత
మై మధురము కాదా ? // నా //

# అలుకలో అందాలు

అలిగితే అది ఏమి చిత్రమోకాని
అపురూపమైన అందాలెన్నొ చిందు
ఏరుకోనీయవే ఎలనాగ నన్ను
ఎన లేని సొగసుల సిరుల దొంతరులు // అ //

చిరుకోపమున బుగ్గ లెరుపెక్కినపుడు
హరివిల్లు గగనాన విరిసెననిపించు
దరహాస చంద్రికలు దాచేసినపుడు
మరుమల్లె తొలకరులు కురిసెననిపించు // అ //

మునిపంట కెమ్మోవి మృదువుగా విరిచి
కనురెప్పలల్లార్చి ననుచూసినపుడు
ఎన్నడూ ఎరగని వింత సోయగము
తలపులను నింపుకొని దాచ మనసౌను // అ //

# ఛాయా చిత్రం

కమ్మని నీ వ్యక్తిత్వం
బొమ్మకు కలిగేనా ?
కదలదు మెదలదు కాటుక
కనురెప్పలనార్పదు //క//

అలిగినపుడు కురిసే ఆ
అందాలెక్కడివీ ?
సొలసి నపుడు విరిసే నీ
సోయగ మెక్కడదీ ? //క//

సిగ్గిల్లిన బుగ్గలలో
నిగ్గులు నిండేనా ?
చిత్రమైన చిరునగవుల
జిలుగులు చిందేనా ? //క//

కలత పడిన ఉపశాంతిని
కలిగించే పలుకు
ఛాయా చిత్రానికెలా
సమకూరును ఓ చెలీ //క//

( ఉర్దూ. కవితకు స్వేచ్ఛానువాదంగా)

# అల్లరినీది - నల్లనయ్యా !

అల్లరంతా నీది
అపనింద నాది
నల్లనయ్యా ఏమి
న్యాయమిది నీకు ? // అ //

వ్రజభామినుల కూడి
మధురకని పోవ
నా వెనుక ఈలలు
భావ్యమా నీకు ? // అ //

తీసి పెట్టిన వెన్న
దాచనే లేదు
వెనుతిరిగినంతలో
కనుపించ లేదు // అ //

నీడలా నన్నంటి
వీడనంటావు
నగుబాటు నాకని
నమ్మవా నీవు // అ //

# నా ఆశ చిన్నదే

చిన్నదే నా ఆశ
చెల్లింప లేవా ?
నీ నీడ నేనుండి
సేవింప నీవా ? ॥ చి ॥

గాలినై వేణువున
క్షణమున్న చాలురా
రాగ ఝురినై పొంగి
సాగిపోతాను ॥ చి ॥

నెరికురుల నొక చిన్న
నెమిలి పింఛము నైన
ధన్యమీ బ్రతుకని
తనిసి పోతాను ॥ చి ॥

కనుదామరల మధ్య
కస్తూరి తిలకమై
కురిపించి నెత్తావి
మురిసి పోతాను ॥ చి ॥

ఈ రేడులోకాల
నీ రూపమే చూసి
నా ప్రలోభానికే
నవ్వుకుంటాను ॥ చి ॥

(ఆకాశవాణి సౌజన్యంతో)

# నిరీక్షణ

రెప్పవేయని కంటితోనే
రేయి గడిచేనా ?
మాట నిలపని వాన్నికై ఈ
హాయి మిగిలేనా ? // రెప్ప //

చేతిలో చెయ్యేసి చెప్పిన
చిన్ని మాటకు మనసు నీరై
చెక్కిటను మునివేళ్లతాకిన
మక్కువకు నా వలపు ఏరై // రెప్ప //

మింట చుక్కలు లెక్కపెడుతూ
ఒంటిగా నిరుపేద వాకిట,
మనసులో చిరుదివ్వెగా నా
మమతనే వెలిగించి ఆశగ // రెప్ప //

# యుగళ గీతం

పు :- కన్నూ కన్నూ కలిసిన
కమ్మని ఈ వేళ
మాటలతో పనిలేదిక
మనసులొకటి అయితే................ ॥ క ॥

స్త్రీ:- కన్నెమనసులో అలజడి
కలిగించకురా
వెన్నలాటి చిన్నవాడ
ఇటు చూడకురా .................... ॥ క ॥

పు:- వాడి వాడి చూపులున్న
వాలుకళ్ల చానా
వేడి చూపు తూపులతో
వెన్న కరగి పోదా ?..................... ॥ క ॥

స్త్రీ:- మాట కారి పిల్లవాడ
మంత్రించకురా
ఈల పాట ఈటె వేసి
వేటాడకురా........................... ॥ క ॥

# వేకువ

ఈ వేకువ
    చెలిమనసును తెలిపింది
ఈ తెమ్మెర
    తొలి వలపును రేపింది. // ఈ //

యుగళ గీతి
    కిదె పల్లవి కాగ
అనురాగమె
    ఆలాపన కాగ. // ఈ //

అలసిన ఎద
    చిరుతొలకరి లాగ
మధువని విరి
    సిన మల్లియలాగ // ఈ //

ఆకసాన
    అందాలను చింది
చిరునవ్వైన
    ఇంద్ర ధనువులాగ... // ఈ //

# ఎదురుచూపు

ఎదురుచూసి ఎదురు చూసి
ఎంత అలసినానో
ఏమని వినిపించను ని
న్నెలా అనునయించను. // ఎ //

ఏల రాక పోతివో అని
బేలగ నాలో నేనే
వలపులోన వగపు కలిపి
తలపులోన ఆశ నిలిపి // ఎ //

వాడిన ఈ మల్లెలెరుగు
వాలుతున్న చుక్కలెరుగు
మిణుకు మిణుకుమని ఎగిరే
మిణుగురులను నీవె అడుగు // ఎ //

చేదును ఎదలోన నింపి
చేజారిన దొక్క రేయి
ఇక నీతో వాదులాడి
ఫలమేమని అనుకుంటూ // ఎ //

# గోదారి తురిమింది కొండ మల్లియలు

సరికొత్త అందాలు
సంతరించుకుని
గోదారి తురిమింది
కొండ మల్లియలు //స//

సహ్యాద్రి సానువుల
చనుపాలు కుడిచింది
ముద్దుగా ఉరికిపడి
మురిపాలు కురిసింది //స//

కవ్వింపు చేడెలా
గారాల కన్నెలా
పాపికొండల మధ్య
పరవళ్ళు తొక్కింది //స//

పల్లె పల్లెల తట్టి
పలుకరింపులు నెరపి
తెలుగు నడులను కలిపి
వెలుగు బాటలు వేసి //స//

పచ్చ పచ్చని చేల
మెచ్చుకోలుగ చూసి
కడలి కౌగిట చేర
గల గలా సాగింది //స//

# పూలతో చెలిమి

చేలతో పూలతో చెలిమి చెయ్యాలి
పైర గాలికి ఊగి పాడుకోవాలి //చే//

తొలికోడికూతకే మేలుకొని నిద్ర
తూరుపున కొండెక్కి తొలిసందె సిరులు
వేడిగాడుపులోన ఇగిరి పోకుండ
దండిగా ఎదనింపి దాచుకోవాలి //చే//

తెలి మబ్బు తేరెక్కి తేలిపోవాలి
ఇలలోని అందాలు ఏరుకోవాలి
ఊహలతొ చక్కని ఉయ్యాల కట్టి
ఊగుతూ నలుదెసల సాగి చూడాలి //చే//

రెక్కలను ముడుచుకుని రేయంత తూగి
ఉదయాన ఊరేగబోవు చిలుకలను
కలుసుకుని నే నొక్క పక్షినై పోయి
ముచ్చటలు చెప్పుకుని మురిసి పోవాలి //చే//

# భాద్రపద సౌందర్యం

కురిసి కురిసి మబ్బు
నిదానించిందీ
కొత్త రుచుల గగన సీమ
విరిసిందీ ॥ కు ॥

విశ్వంభర పరవశాన
తేలిందీ
విమల ప్రేమ తత్త్వము విద
రించిందీ ॥ కు ॥

పచ్చనీ తరులతల
నీడచేరి
ప్రాణకోటి భయము విడిచి
నిలిచిందీ
కర్షక జన సందోహము
తని సీ
హర్షోల్లాసాల నాల
పించిందీ ॥ కు ॥
గలగల - సెలఏటి పాట
వింటూ
కళ కళ ఉపవనము మిసిమి
మీరిందీ
మారిన ఋతు రాగ
ఛాయలోనే
ధారుణి సౌందర్య గరిమ
చాటిందీ ॥ కు ॥

(ఆకాశవాణి సౌజన్యంతో)

# భద్రమైన పథం

కారు మొయిలు తమసమ్ములు తొలగేనా ?
గగన వీధి పావురాలు ఎగిరేనా ?
విశ్వశాంతి యాత్రీకుని పయనం
విఘ్నాలను అధిగమించి సాగేనా ? // కా //

మారణహోమాల మాట మరచీ
మానవాళి ఒకటై మనగలిగేనా ?
యుద్ధభయం అభ్యున్నతి కాదను
బుద్ధిబలం నరులకు సిద్ధించేనా // కా //

భద్రమైన పథమే వారధిగా
ప్రగతికోరి భావితరం నడచేనా
క్షుద్రమైన నరమేధను కొలిచే
ఉన్మాదుల ఆగడాలు సమసేనా ? // కా //

మమతా సద్భావనలను నిలిపే
మానవతా వాదుల కలపండేనా ?
నందనమై విలసిల్లిన భువిలో
సుందరమై స్నేహసుమం విరిసేనా ? // కా //

# భాద్రపద చింతన ( 1999)

కారు మొయిలు చీకట్లవి
కరగుతున్న వేళ
మెరసిందొక కొత్త ఆశ
అలసిన హృదయాన //కా//

అధిగమించి విఘ్నాలను
ఆకసాన ఎగిరి
ఇక తెల్లని పావురాయి
తిరుగాడునొ ఏమొ //కా//

భద్రమైన పథము బట్టి
మత్సరాలు మరచి
మానవాళి ప్రగతి నెరిగి
మనగలుగునొ ఏమొ //కా//

యుద్ధం నరమేధ వద్దు
వద్దను సద్బుద్ధి
సిద్ధించే భావితరం
చివురించునొ ఏమొ //కా//

మమతా సమతా కోరిన
మానవతా వాదుల కల
పండి పుడమి నందనమై
పరమళించు నేమొ //కా//

# శరదృతు గీతం

శరన్మేఘ మాలికలో
చిరునవ్వుల వాడా !
ఆలపించు ఆశువుగా
నీ తియ్యని గీతి ॥ శ ॥

తరులు ఝరులు తరంగిణులు
తనవి తీర రేయంతా
తలలూచే పాట నీది
చక్కని నెల రేడా ! ॥ శ ॥

ఎద ఎదలో మమత నించి
ఈ భువికి ప్రశాంతి పంచి
కవి గాయక హృదయాలను
కరగించే పదము ॥ శ ॥

విరివిగ నీహార రుచుల
అడిగిన లేదనక కురిసి
సమతా స్నేహము నెరపే
సౌజన్యము నీది ॥ శ ॥

భువికీ దివికీ చల్లని
వెలుగుల వారధిని కట్టి
విమల ప్రేమ తత్త్వమునే
వివరించే నుడుల ॥ శ ॥

# సంక్రాంతి

జీవన స్రోతస్వినిలో
చైతన్య తరంగం
సంక్రాంతికి వెల్లువైన
సరాగాల కదనం // జీ //

బుజ్జి బుజ్జి పాపాయికి
భోగిపళ్ళు పోసుకున్న
తల్లి అంతరంగంలో
విరిసిన ఆనందం // జీ //

పట్టుచీర రెప రెపతో
ప్రమదలు తమలో తామే
పసుపుకుంకుమలు పండ్లను
పంచిన ఆనందం // జీ //

ఏడురంగులాకసాన
ఎగసిపడే సందడిగా
పతంగాలు విడిచిపెట్టు
బాలల ఆనందం // జీ //

పగటివేషగాళ్ళ ప్రతిభ
గంగిరెడ్ల విద్దెలు కని
మురిసిపడే జానపదుల
మదిలో ఆనందం //జీ //

# దీపావళికి నీరాజనం

దివ్వెలతో పటాకీల
సవ్వడితో నవ్వులతో
వాకిట వాలిన దీపా
వళికిదె నీరాజనం. // ది //

నరకాసుర దర్పముడిగి
నలుదిశలను వెలుగునిండి
ప్రమదల విజయోత్సాహం
ప్రభవించిన సుదినంగా - // ది //

రివ్వున ప్రగతి పథంలో
జువ్వల్లా సాగి మనం
కుల మత కుటిలత్వాలను
కూల్చి అధిగమించాలని - // ది //

వీధి వీధితోరణాల
వెలిగిన విజ్ఞాన జ్యోతి
సౌజన్యం నించి మనకు
సంతోషం పంచాలని - // ది //

# సంక్రాంతి (౨)

మనోజ్ఞమీ మకర సంక్ర
మణశుభ సమయం
మధుర భావ రాగ భరిత
మీ హేమంతం // మ //

రంగవల్లికలు విరిసిన
రమ్యమైన వాకిట్లో
కన్నెపిల్లలాడి పాడి
కనుల విందు కూర్చగా- // మ //

చలి మంటల దరికి చేరి
శ్రామిక కార్మిక జనాళి
పరస్పరం స్నేహ ధనం
పంచి, వినోదించగా- // మ //

తియ్యని సంకీర్తనములు
జియ్యరు గళమెత్తి పాడ
పచ్చని తోరణ పంక్తుల
వాడ వాడ మురియగా. // మ //

( ఆకాశవాణి హైదరాబాద్ కేంద్ర సౌజన్యంతో)

# హేమంతం వచ్చింది

హేమంతం వచ్చిందొక
సీమంతిని లీల
మురువు లెన్నొ కురిపిస్తూ
ముచ్చట భువి నేల - ॥ హే ॥

దినము తరిగి రేయి పెరిగి
దినకరుడే హాయి గొలుప
చలి మంటల వెలుగుల్లో
నులి వెచ్చని ఊహలుంచి - ॥ హే ॥

కళ్ళములో సస్యరాశి
కని కష్టాలన్ని మరచి
నిలచిన కర్షక లోకపు
నెలవుల్లో ఆశనించి. ॥ హే ॥

బంతిపూల, చేమంతుల
పచ్చని గుమ్మడి తీవల
కనువిందుగ జనపదాల
తీర్చి వన్నెలెన్నొ పొదిగి - ॥ హే ॥

# సంక్రాంతి (3)

వేకువనే తెలుగింటి వాకిళ్ళ విరిసి
మధురిమలు కురిసింది మకర సంక్రాంతి
చీకాకు లెన్నున్న చిరునవ్వులిచ్చి
ఈ బ్రతుకుపై ఆశ నించే సంక్రాంతి                    // వే //

ముత్యాల ముగ్గులో గొబ్బిళ్ళ నుంచి
కన్నెపిల్లలు గళము కలిపేటి వేళ
పసుపు పూసిన ద్వార బంధాలపైన
ఆకు పచ్చని తోరణాలూగు వేళ                    // వే //

రాగ రంజితమైన వాడ వాడలలో
తియ్యగా గొంతెత్తి జియ్యరులు పాడ
చలి మంట వెలుగులో శ్రామికులు కూడి
ముచ్చటలు చెప్పుకుని మురిసేటి వేళ                    // వే //

# శిశిర సౌందర్యం

చలి విరిగిన శిశిర ఋతువు
సౌందర్యమె వేరు
చిక్కినమ్మ వదనంలో
చక్కదనం తీరు //చ//

నీలి రంగు తెరమీదను
లీలగ రేఖలను గీసి
ఆకులేని మ్రాకులతో
అలరించే చిత్రపటం //చ//

అభ్యంగన స్నాన మాడి
అందమైన వలువలకై
వనకన్యలు నిరీక్షించు
అతిమనోజ్ఞ దృశ్యమ్మిదే. //చ//

పచ్చగ ఇక వసుధ నేల
వచ్చే ఋతుశోభలకై
పశుపక్షులు ప్రాణికోటి
పరితపించు కాలమిదే //చ//

# ఉగాది పాట

తోటంతా పరవశించి
పాటై విరిసింది
పంచమస్వరమున కోయిల
పల్లవి వినుపింప // తో //

జుమ్మని తుమ్మెద గుంపులు
శ్రుతులను సవరింప
తలలూచే తరుశాఖలు
తాళగతులు తెలుప // తో //

కోకొల్లలుగా చిలుకలు
కొమ్మలపై వాలి
కొత్త చివురు గుబురులలో
కూరిమి నెరపంగ // తో //

చలి విరిగిన చిరుగాలుల
సన్నజాజి తావి
బ్రతుకెంతో తియ్యని దను
భావన కలిగింప // తో //

# వసంత ఋతువు

కమ్మ తెమ్మెర తెల్లవారగ
కబురు తెచ్చిందేమిటో ?
సిగ్గులొలికే మాధవీలత
చెవిని వేసిందేమిటో ? ॥ క ॥

మాధవీలత గున్న మావితొ
మంతనాలవి ఎందుకో ?
కొంటె నవ్వుల పూల జల్లుల
కొసరి గుస గుస లెందుకో ? ॥ క ॥

తియ్యనిది మన స్నేహమంటూ
తెలుపుకున్నది జంటగా
శిశిరమే ఇక లేదు మనకని
చెప్పుకున్నది గుట్టుగా. ॥ క ॥

ఎదురు చూసిన ఈ వసంతము
మధురిమలు కురిపించగా
ఎవ్వరెరుగని హాయి మనదని
నవ్వుకున్నవి తృప్తిగా. ॥ క ॥

( ఆకాశవాణి సౌజన్యంతో )

# వేకువనే ఉగాది

వనమంతా పరవశించి
వలపులు కురిసింది
ఈ వేకువనే ఉగాది
ఎదను తట్టి పిలువ // వన //

గండు తుమ్మెదల బారులు
కలిపి సిగను చుట్టి
మల్లెలు మొల్లలు కూర్చిన
మకుటము ధరియించి // వన //

పలు చిలుకల బాసలతో
పాటలు రచయించి
కోయిల పెంచిన స్థాయికి
గొంతును సవరించి // వన //

పరిమళించు పల్లవాల
వలువలు ధరియించి
క్రొన్ననల సుగంధ మలది
కోర్కెలు చివురింప // వన //

# మబ్బుతునకా

మబ్బుతునకా మంచి
మనసుంది నీకు
ఆ మంచిలో కాస్త
మాకియ్యవమ్మ // మ //
మున్నీటి నిట్టూర్పు
లో ఉద్భవించి ( రూపుదాల్చి)
నీరు నిప్పు గాలి
నీలోన నిలిపి // మ //
మొయిలువై గగనాన
హొయలు చూపించి
కొండ కొనల తేలి
కురిసి పోతావు // మ //
ఈ దేశ మీ రాజ్య
మీ ప్రాంతమన్న
భేదభావము లేదు
ద్వేషాలు లేవు // మ //
అవని జనులందురూ
ఆప్తులే నీకు
అందరిని సమముగా
ఆదుకుంటావు

( ఆకాశవాణి సౌజన్యంతో ) // మ //

# సమైక్య భారత చరితం

సమతా మమతా సోదరభావం
సమైక్య భారత చరితమిది
సనాతనంగా జగతికి చూపిన
చక్కని జీవన మార్గ మిది //స//

ఉదాత్త భావన ఏ దెస వీచిన
ఒదిగి నుతించే వేద మిది
వసుధ జనులు ఒక కుటుంబమంటూ
పలికిన గురుకుల వాద మిది //స//

వివిధ మతాలూ విభిన్న భాషలు
వికసించిన ఉద్యానమిది
సకల సంస్కృతుల సమాదారించే
సుకవీంద్రుల ఆస్థాన మిది. //స//

సత్యదర్శనమె మతగమ్యముగా
చాటిన ఆశ్రమవాటి ఇది
విశ్వజనుల సంక్షేమం కోరే
విశాల హృదయుల వాసమిది //స//

# సహన శీల వేదం

మానవాళి మనుగడకీ
మలచిన సన్మార్గం
మానవతా వాదం పర
మత సహన నినాదం // మా //

శాక్యమౌని చూపించిన
సహజీవన సరళిలో
అల అశోక చక్రవర్తి
ఆదర్శపు పరిధిలో // మా //

పండిన సూఫీ సమగ్ర
భక్తి భావ పథములో
మానవాభ్యుదయ విశాల
మానస సుమ వనములో // మా //

తరతరాల యోగివరులు
దర్శించిన నీడలో
శాంతి కాముకులు నడచిన
సనాతనపు జాడలో // మా //

# మతం

మతమన్నది మల్లియలా విరిసి
మనసులలో మమత పరిమళించాలి
మతమన్నది వెన్నెలలా కురిసి
ఎద ఎదలో స్నేహ ధనం పండాలి. // మ //

మారణహోమం తగదని పలికి
మాత్సర్యపు తెరలను తొలగించాలి
తల్లి పుడమి ఒడిలో మనమంతా
పిల్లలమను భావన మొలకెత్తాలి // మ //

విలువైనది జీవితమని తెలిపి
వెలుగు దారి నరులను నడిపించాలి
మానవాళి నొక్కబాట మలిపి
మనుగడలో సమభావం నించాలి // మ //

( ఆకాశవాణి హైదరాబాద్ సౌజన్యంతో )

# సమైక్య భారత సంస్కృతి

రంగు సువాసన ఆకర్షణలో
రకరకాల పూలెన్నున్నా
తేనె పట్టులో విరిసిన చిక్కని
తియ్యదనం అది ఒకటే // రం //

విశాల భారత భువిపై నిలిచిన
విభిన్న భాషల కలయిక లో
సజీవమై విలసిల్లిన భారత
సమైక్య సంస్కృతి ఒకటే // రం //

మానవాళి సౌభాగ్యం కోరే
మతాలు మార్గాలెన్నున్నా
మనసులు కలిపే మంచిని పెంచే
మహా లక్ష్యమది ఒకటే // రం //

భిన్నత్వంలో ఏక సూత్రమును
విశాల దృష్టిని సాధించి
విశ్వశాంతికై నినాద మిచ్చిన
వేద సారమది ఒకటే // రం //

# భారతీయ సంస్కృతి

శతపత్రంగా భారత
సంస్కృతి విరిసింది
సారూప్యం వైవిధ్యం
సమపాలుగ కలిపి - ॥ శ ॥

తరతరాల యుగయుగాల
తాత్త్విక చింతనతో
జన జీవన వాహినిలో
చైతన్యం నెరపి - ॥ శ ॥

సహజీవన సౌందర్యపు
సరిహద్దుల పెంచి
వసుధే ఒక కుటుంబమై
వర్ధిల్లగ నెంచి- ॥ శ ॥

బహుముఖ విజ్ఞాన పత్ర
పరిమళాలు చిమ్మి
సౌశీల్యమై విశ్వశాంతి
సాధనమని నమ్మి ॥ శ ॥

(ఆకాశవాణి సౌజన్యంతో)

# భరతావని దివ్యధాత్రి

నీ చరితం అతి మధురం
నిత్య స్మరణీయం
భరతావని దివ్యధాత్రి
పావని శుభగాత్రీ ! // నీ //

హిమవన్నగ మణి మకుటం
సుమ సౌరభ కాశ్మీరం
గంగా కంఠా భరణం
కావేరీ కటకం. // నీ //

కార్మిక, కర్షక శ్రామిక
ఘర్మ సలిల భాగ్యం
కవిగాయక వైతాళిక
కావ్య సుధాపానం // నీ //

త్యాగనిరతి – తపోధనం
యోగివరుల సేద్యం
సస్యశ్యామల క్షేత్రం
సహజీవన సూత్రం. // నీ //

# మన దేశం

అణువణువున చెప్పలేని పులకింత
మనసులోన చిత్రమైన గిలిగింత................. // అ //

ఎగసి పడే సాగరాలు
మనచుట్టూ వుంటే

ఎత్తయిన హిమాలయాలు
ఉత్తరాన కంటె
గంగాయమునలు గలగలు
ప్రవహిస్తూ వుంటే
గౌతమి కృష్ణలు బిలబిల
కడలికి పోతుంటే .................. // అణు //

వేదగాన మిక్కడనే
వినిపించిందంటే
ఆదికావ్యమీ నేలనే
అలరిందని వింటే
గౌతమ బుద్ధుడు ఇక్కడ
విహరించాడంటే
గర్వంగా మన పతాక
నిలిచి ఎగురుతుంటే.............. // అణు //

# చిన్న కుటుంబం

చిన్న కుటుంబమె ఇలలో
సిరులొలికే స్వర్గం
రానున్న తరాలకదే
రమ్యమైన మార్గం //చి//

పరస్పరం గౌరవించు
పతిపత్నుల వలపులలో
సమభావమె ఊపిరిగా
ఉదయించిన శిశువులతో //చి//

ఆగర్భంగా పిల్లల
కరిష్టాలు సోకనీక
కంటి రెప్పలై పెంచే
కన్నవారి రక్షణలో //చి//

ఆడబిడ్డ మగ శిశువని
తేడాలే లేకుండా
రెండు కళ్లుగా బ్రతుకును
పండించిన బాటలో //చి//

# సరోజినీ నాయుడు

నీ పాటవిని తోట
నిదుర లేచింది
కోయిలమ్మా ! నీకు
పూల దోసిళ్ళు...................... // నీ //

వంగ వంగడముకు
వన్నెలే తెచ్చావు
భరతమాతకు ముద్దు
పట్టివైనావు........................................ // నీ //

మెట్టిన తెలుగింట
మెరుగులే చిమ్మి
విశ్వకవితా వీధి
కెగసి నావమ్మ.................................... // నీ //

స్వారాజ్య సమరాన
వీరాంగనలకు
పోరాట పటిమను
బోధించినావు................................... // నీ //

బాధ్యతలు ఏవైన
బరువు లేవైన
వెనుకంజవేసి నీ
వెరుగవేనాడు...................................... // నీ //

పాలించు రీతిలో
భాషించు కళలో
నీకు నీవే సాటి
నిజము ఓయమ్మ.................................. // నీ //

స్త్రీ జాతికే నీవు
శిరోరత్నముగ
ఈదేశ చరితలో
వెలిగినావమ్మ..................................... // నీ //

# దుర్గాబాయ్ దేశ్‌ముఖ్‌కు నివాళి

మహిళల అభ్యుదయానికి
మణి దీపం నీవు
దుర్గమ్మా ! భరతావని
వరపుత్రివి నీవు......................... // మ //

అబలవు కావని స్త్రీలో
ఆత్మబలం నిలిపి
విద్యాదానం చేసిన
విశారదవు నీవు....................................... // మ //

పదవులు బాధ్యత లెన్నో
పదిలంగా నెరపి
ప్రజాసేవలో బ్రతుకును
పండించితి వమ్మా................................ // మ //

తెలుగు వారి వాకిట్లో
మల్లియవై విరిసి
పరిమళాలు నలు దెసలకు
విరజిమ్మితి వమ్మ................................ // మ //

ఏకాగ్రత కార్యదీక్ష
దేశభక్తి లోన
నీకు సాటి నీవే అని
నీ చరిత్ర సాక్షి....................................... // మ //

( దృశ్యశ్రవణ వికాస కేంద్ర సౌజన్యంతో )

# రాధాకృష్ణ పండితుడికి నివాళి

విశ్వవీధి భారతీయ
సంస్కృతి వివరించి
గురువులకే ఒజ్జవైన
కోవిదుడవు నీవు – ॥ వి ॥

తిరుత్తణిని అవతరించి
దిశాంతముల దీపించిన
నీ చరిత్ర సర్వస్వం
నిత్యస్మరణీయం ॥ వి ॥

వివిధ మతాలకు మూలం
వెతకిన పాండిత్యగరిమ
దశ దిశలకు పంచి పెట్టు
దౌత్యవృత్తి నీది ॥ వి ॥

విద్యాలయ సీమలలో
వెలుగులు వెదజల్లినావు
విద్యాధనుడవు వక్తవు
వేదాంతివి నీవు ॥ వి ॥

విస్తరించి ఘోషించిన
విద్యాసాగరము నీవు
నీ పవిత్ర జన్మ దినం
ఈ జాతికి పర్వం ॥ వి ॥

# అంబేద్కర్

అస్పృశ్యతతో సాగిన
అవిశ్రాంత సమరం
అతి సాహస భరితం ఈ
అంబేద్కరు చరితం. // అ //

చిత్తశుద్ధి కార్య దీక్ష
చెదరని సుగుణములై
నవభారత రాజ్యాంగము
నందించిన ఘనుడు // అ //

కర్షక కార్మిక జనులను
కాపాడిన వాడై
వనితల అభ్యుదయానికి
బాట వేసెనతడు // అ //

తరగని ఆత్మాభిమాన
ధనుడై దీపించు
అతని జీవితం యువతకు
ఆదర్శ ప్రాయం // అ //

( దూరదర్శన్ సౌజన్యంతో )

# భారతయువతీ అభినందనం

తరతరాల శృంఖలాల
దాస్యం ఇక చెల్లదని
ఉద్యమించు ఓ భారత
యువతీ అభినందనం. // త //

పురుషాధిక్య సమాజపు
మహిషాసుర వాదానికి
రాజీపడి ఎరుగని భా
రతనారీ వందనం. // త //

తర తమ భేదాలు లేని
నరనారీ సౌజన్యం
వాంఛించే నీ ఉదాత్త
భావన కభివందనం. // త //

అవమానం – వివక్షలను,
అనవరతం ఎదిరించే
నీ సమరోత్సాహానికి
నీ రాజన వందనం. // త //

# ఈ ధరిత్రి చరిత

హిమగిరులే తెలుప గలవు
ఈ దేశపుటౌన్నత్యం
అవక్రమం పరాక్రమం
ఆగ్రహమే వస్తే - // హి //

భారతీయ సౌజన్యం
బలహీనతగా ఎంచకు
చోరబాటుకు అవకాశం
ఇక లేనే లేదు. // హి //

పరమత సహనం స్నేహం
నిరంతరం వాంఛించే
ఈ వీరులు చేయ లేదు
దురాక్రమణ లెపుడు // హి //

తమ సీమను రక్షించే
ధర్మనిరతిలో ఎన్నడు
వెనుకాడని మానధనులు
అని తెలిసిన మేలు // హి //

# టంగుటూరి ప్రకాశం

సాహసానికి మరో పేరే
టంగుటూరి ప్రకాశమై
వన్నెతరగని ఖ్యాతి నీదోయ్
భరత జాతి చరిత్రలో // సా //

తెలుగు తోటను విరిసినావోయ్
వెలుగు బాటలు వేసినావోయ్
తెల్లదొరల తుపాకి గుండ్లకు
తెరచి గుండెలు చూపినావోయ్ // సా //

లక్షలను ఆర్జించు వృత్తిని
లక్ష్యసిద్ధికి విడచినావోయ్
దేశమాతకు సేవ చేసే
దీక్ష నెరపిన కర్మయోగివి. // సా //

రైతు జనులను క్రుంగదీసే
రీతి సాగిన జమిందారీ
పద్ధతికి నీ భరతవాక్యం
ప్రజల మన్నన లందుకొన్నది. // సా //

# ప్రకాశం

ఉత్సాహంతో వెలిగే వదనం
ఉరికే సాహసి కదనం
జాతీయోద్యమ చరిత్రలోనే
శాశ్వత కీర్తి ప్రకాశం. // ఉ //

భయమంటేనే తెలియని బాల్యం
ప్రజాసేవలో ధైర్యం
బారిష్టరుగా ఎదిగిన వైనం
బ్రతుకొక సాగర మథనం // ఉ //

అనవరతం నిరుపేదల కోసం
అన్యాయంతో సమరం
ఔదార్యానికి త్యాగనిరతికీ
ఆతడు ఒక ప్రతి రూపం // ఉ //

ఆంధ్రకేసరని అందరు అన్నా
అ సమగ్రం ఉపమానం
అఖండ భారత వీర సింహమని
అంటేనే అది సత్యం // ఉ //

*( 21.5.1995 ఆకాశవాణి హైదరాబాద్ బాలానందంలో)*

# అంబేద్కర్ !

అందరినీ సమదృష్టిని చూడమనీ
అందరిలో ఆత్మబలం పెంచమనీ
అంబేద్కర్ చెప్పిన దే వేదం
అదే అదే మానవతావాదం. // అం //
మనిషికి మనిషికి మధ్యన
మసగ తెరలు ఎందుకనీ
సమాజాన స్త్రీ శక్తికి
సరిహద్దులు ఉండవనీ // అం //
ఆకలి దారిద్ర్యంలో
అజ్ఞానం తప్పదనీ
అజ్ఞానం చెదరనిదే
అభ్యుదయం కాబోదని // అం //

మనిషి విలువ గుర్తించని
మతం మతం కాలేదని
నేల విడిచి సాముచేయు
నీతి బలం నిలవదనీ. // అం //

( దూరదర్శన్ సౌజన్యంతో )

# అంబేద్కరా!

నీడలేని జనాలతోడుగా నీవుండి
నేతవైనడిచావు అంబేద్కరా !
తోడు నీడవై నిలిచావు అంబేద్కరా ! // నీడ //

నల్లవన్ని నీళ్లని తెల్లవన్నిపాలని
నమ్ముకున్న పేదలకు న్యాయమందించి
నేతవైనడిచావు అంబేద్కరా
తోడు నీడవై నిలిచావు అంబేద్కరా ! // నీడ //

ఆడామగ తేడాలు కూడదని వాదించి
అందరికి ఒక్కటే న్యాయమని చెప్పి
చదవూ సంధ్యాలేక శ్రమపడే పేదలకు
పలకా బలపాలిచ్చి పాఠాలు చెప్పి // నీడ //

(దూరదర్శన్ సౌజన్యంతో)

# ఆశాజ్యోతి

నీలో ఆశాజ్యోతిని
    నిలకడగా ఉంచు
సామాజిక జీవితాన
    వెలుగులు ప్రసరించు - // నీ //

దురాశగా మారి తేను
    తోటివాని నార్చు
సామాజిక జీవితాన
    సంఘర్షణ పెంచు - // నీ //

నిరాశగా మారితేను
    నిన్నే నిర్జించు
నీలో వెలుగే నశించి
    ఆలోచన త్రుంచు // నీ //

శాక్యమౌని బోధనలో
    సారం గ్రహియించు
ఇతిహాసపు పుటల త్రిప్పి
    నిజమును దర్శించు // నీ //

# కొత్త వెలుగు విరిసింది

విరిసిందొక కొత్త వెలుగు
భారతీయ ప్రాంగణాన
ప్రగతి పథంలో జాతిని
వడివడిగా నడుపు. // వి //

సద్భావన సౌశీల్యం
సముచితమని తెలుపు
సరళీకృత మార్గంలో
నీదేలే గెలుపు. // వి //

ఐకమత్యమే బలమని
అందరినీ కలుపు
కులమతాల కుటిలత్వం
కూల్చి దారి మలుపు // వి //

విశ్వ వీధి విపణిలోన
నీ సరుకులు నిలుపు
అందరిలో ముందు నిలిచి
ఆశ్చర్యము గొలుపు. // వి //

(దూరదర్శన్ హైదరాబాద్ సౌజన్యంతో)

# అక్షరాల సిరులు

అవనిలోని జనుల మధ్య
అంతరాలు తొలగించే
వారధులే అక్షరాలు
మరవకు ఈ సత్యం // అ //

అజ్ఞానపు చీకటిలో
అందరికీ దారి చూపు
కరదీపికలన్న మాట
కాదనలే రెవరూ // అ //

అన్ని విద్యలకు ఊపిరి
అక్షరమని ఎరగవోయి
విద్యలేనిదే మనిషికి
విలువేలేదోయీ // అ //

దూర దృష్టితో పెద్దలు
వారసత్వ సంపదగా
అందించిన అక్షరాలు
చిత్రమైన సిరులోయి // అ //

# అక్షర జ్యోతి

అక్షరాలు వెలిగిద్దాం
ఆరని జ్యోతులుగా
అజ్ఞానం నిలువ లేక
అదిరి వెన్ను చూపగా - // అ //

చీకటి రక్కసి మాటున
చీడపురుగులై చేరిన
విద్రోహపు శక్తులకే
వెరపును కల్గించగా- // అ //

సౌశీల్యం సద్భావం
సమధర్మం సౌజన్యం
భరతజాతి సంస్కృతినే
ప్రపంచాన చాటగా- // అ //

మతమౌఢ్యం మాత్సర్యం
మనకు మేలు చేయవనీ
ప్రగతి పథంలో జనాళి
ప్రస్థానం సాగగా // అ //

( దూరదర్శన్ సౌజన్యంతో)

# అక్షర వ్యవసాయం

అజ్ఞానపు బీళ్ళు దున్ని
అక్షరాలు విత్తి
విజ్ఞానపు పంటకోసి
విరివిగ పంచండి. // అ //

కలుపు మొక్క లేరి వేసి
గడ్డలన్ని పగుల గొట్టి
మానవతావాదంతో
మన పొలాల కెరువు వేసి // అ //

సమభావం సమధర్మం
సౌశీల్యం మన మతమని
చాటి చెప్పి సామాజిక
చైతన్యం చివురించగ // అ //

జీవితమే ఒక వరమని
ప్రేమతోనె సార్థకమని
ఐకమత్య సాధనతో
అందరమూ బ్రతకాలని // అ //

( దూరదర్శన్ సౌజన్యంతో )

# వగపు లేదు వయోధికా !

వగపు లేదు దిగులు లేదు
వయోధికా నీకు
నీ మదిలో ధ్యేయ మొకటి
నిలుపుకున్ననాడు // వ //

నెన్నుదుటను అనుభవాల రేఖలతో
నిన్నటికీ నేటికినీ వారధివి.
బ్రతుకు బరువుతో సోలిన వాహకుడా
గతకాలపు యువశక్తికి సారధివి // వ //

నీ గళమున విశ్వప్రేమ నినదించగ
రాగములో అనురాగము రవళించుము
నీ పలుగులె యువతకు కరదీపికలై
నిశ్చయముగ వెలుగు బాట నడిపించును // వ //

( స్రవంతి - ఆకాశవాణి సౌజన్యంతో)

# వార్ధక్యము లేదులే

వార్ధక్యము లేదులే ఎన్నడూ
వృద్ధాప్యము రాదులే రాదులే  // వా //

సంతృప్తితో నిండి
సమభావమున పండి
మమత నెరిగిన పెద్ద
మనసున్న వాడికి.........  // వా //

తనవారు దరిని లేరను
దుఃఖమును వీడి
అందరూ ఆప్తులని
అనుకున్న వాడికి.........  // వా //

అనుభవాలను  పంచి
ఆనందమును పెంచి
పసిపాపలతో ఆడి
పాడగల వాడికి...........  // వా //

( స్రవంతి - ఆకాశవాణి సౌజన్యంతో)

# వయోధికా నీ బ్రతుకు అర్ధవంతమోయి

వయోధికా నీ బ్రతుకది
అర్ధవంత మోయీ
నీ విశాల భావన లే
నిలచి వెలుగు నోయి............. // వ //

కాల జలధి తీరంలో
కాలినడక సాగిన నీ
పాదముద్రలే యువతకు
పథము చూపునోయి.................. // వ //

నీ అనుభవ సమృద్ధిని
నిశ్చింతగ పంచవోయి
ఆత్మానందమున తనిసి
ఆనందము పంచవోయి............... // వ //

సేవాతత్పరులకు ఈ
జీవితమొక వరము సుమా !
అరిషడ్వర్గాల నింక
అధిగమించి సాగవోయి................ // వ //

( ఆకాశవాణి సౌజన్యంతో )

# గణపతి స్తుతి

గడుసోడవె నువ్వంటా
గణపతయ్యా ! మా
గౌరమ్మకు కొడుకువంట
గణపతయ్యా ! మా
ఈశ్వరయ్య కొడుకు వంట
గణపతయ్యా ! ॥ గ ॥

అమ్మానాయన సుట్టూ
ముమ్మారులు తిరిగి తిరిగి
తమ్ముడితో గెలిసి నీవు
గమ్మత్తులు జేస్తివంట ॥ గ ॥

పండుకాయ తినగ బెట్టి
భద్రంగా నీకు మొక్కి
నెలవంకను జూసినాక
నిందలైతె ఉండవంట ॥ గ ॥

పాపమేదొ పున్నెమేదొ
మా పోరల కేమి ఎరుక
మంచిగ నువ్వేలు కుంటె
మా కంతే సాలంటా ॥ గ ॥

( దూరదర్శన్ హైదరాబాద్ సౌజన్యంతో )

# శివతత్త్వం

ఏడ నిన్ను ఎతకబోదురా శంకర నీ
జాడైన లేదాయెరా. // ఏ //

నిన్నూ జూడా బోతె
కన్నూలు మూడంట
నీ సగములో గౌరి
నిలిచీ యున్నాదంట. // ఏ //

నెత్తీని నెలవంక
నీ జడను గంగంట
పుర్రే చేతాబట్టి
ఊరేగుతావంట // ఏ //

ఈరేడు లోకాలు
నీవే అయినా వంట
మా లోనె నీ వుండి
మాయా జేస్తా వంట. // ఏ //

( దూరదర్శన్ గ్రామదర్శిని సౌజన్యంతో )

# నాగుల చవితి

నాగుల చవితికి
నలుగురము కూడి
నీ పుట్ట కొస్తిమి
నిదుర లేవన్న
కోరికలు తీర్చరా
కోడె నాగన్న........................... // నా //

మా కళ్ల బడకుండ
చేల్లల్ల తిరిగి
పంట గింజలు కాసి
పాలించరన్న........................... // నా //

పొద్దుకూకే దాక
పోరల్లు ఆడితే
కాలి కడ్డము వచ్చి
కస్సు మనకన్న........................ // నా //

నూ బిండి ముద్దలు
చలి బిండి దెచ్చి
నీకు తిన బెట్టంగ
నిలిచితిమి రన్న...................... // నా //

# రైతన్న

భూమి దున్నెటోడె రైతురా అందరికీ
బువ్వ పెట్టెటోడె వాడురా...............॥భూమి ॥

ఎండలనక వానలనక
కండలు కరిగించుకుంటు
కష్టా లెన్నున్న గాని
కలుపు మొక్క లేరుకుంటు
నీరు పట్టినోడె రైతురా మన కోసం
నారు పోసినాడె రైతురా ......................॥ భూమి॥

దుక్కి పట్టి గడ్డ లేరి
సక్కంగా ఎరువు లేసి
కంటి నిండ కునుకు రాక
కళ్ళంలో పంట కాసి
కూడు పెట్టినోడె రైతురా మనమంతా
వాడి మేలు మరవ రాదురా..............॥ భూమి ॥

రాజుకైన పేదకైనా
రాజకీయ వేత్తకైన
కడుపులోన ముద్దపడక
గడవదు ఒక పూటైనా .................. ॥ భూమి ॥

# రాతిరి బడి

యాదయ్య:- రాములోరి గుడి ముంగట
రచ్చబండ కాడనే
రాతిరి బడి నడుస్తుండె మైసమ్మా మనం
పోతె బాగుంటదే మైసమ్మా !

మైసమ్మ:- గట్టినా !
మా తాతకు సదుగు రాక
మా నాయన సదూకోక
మా అన్నల కెరికె లేక
మా కైతే చేత గాక
మా భూములు పాయెరా యాదయ్యా ! ఎంత
మంచి ఇల్లు పాయెరా ... యాదయ్యా !

యాదయ్య:- ఉత్తరమే సదవ రాక
పత్తరమే యాది లేక
బస్తీల పని బడితే
బస్సు లెక్క తెలియరాక
ఎంత బుగులు పడతమే మైసమ్మా ! ఇలా
ఎంత కాలముంటమే మైసమ్మా !

మైసమ్మ:- మండిలోన గరజైతే
రెండొందలు చేత బెట్టి
ఎండి కడియ ముంచుకోని

ఏలి ముద్ర లేసుకోని
ఎంత మాయ జేసెరా యాదయ్యా ! శేరు
ఎంత మోస బోతిరా యాదయ్యా !

యాదయ్య:- రాములోరి గుడి ముంగట
రచ్చబండ కాడనే
రాతిరి బడి నడుస్తుండె మైసమ్మా మనం
పోతె మంచి గుంటదే మైసమ్మా !

మైసమ్మ:- రాములోరి గుడి ముంగట
రచ్చబండ కాడనే
రాతిరి బడి కెల్దమురా యాదయ్యా ! మనం
పోయి చదూకుందమురా యాదయ్యా !

(దూరదర్శన్ హైదరాబాద్ సౌజన్యంతో )

# యుగళ గీతం

పు :- కన్నూ కన్నూ కలిసిన
కమ్మని ఈ వేళ
మాటలతో పనిలేదిక
మనసులొకటి అయితే................ ॥ క ॥

స్త్రీ:- కన్నెమనసులో అలజడి
కలిగించకురా
వెన్నలాటి చిన్నవాడ
ఇటు చూడకురా ..................... ॥ క ॥

పు:- వాడి వాడి చూపులున్న
వాలుకళ్ల చానా
వేడి చూపు తూపులతో
వెన్న కరగి పోదా ?..................... ॥ క ॥

స్త్రీ:- మాట కారి పిల్లవాడ
మంత్రించకురా
ఈల పాట ఈటె వేసి
వేటాడకురా............................ ॥ క ॥

# ఆశావాదులం

విశ్వజనాళికి విన్నపమొక్కటి
విస విసలాడక వినరారండి
వికలాంగులమని చులకన చేయక
విరివిగ ప్రేమను పంచండి........................ // వి //

అవిటితనానికి అదరని బెదరని
ఆశావాదమె మావేదం
ఆత్మబలంతో మీ అందరి తో
అడుగులు వేస్తూ పయనిస్తాం..................... // వి //

వెన్ను తట్టి మము ప్రోత్సహించితే
వెనుకాడని ఉత్సాహం మాదీ
మీదీవనలే మాకు రెక్కలై
విహాయసంలో విహరిస్తాం........................ // వి //

నవ సమాజ నిర్మాణంలోనూ
నవ శతాబ్ది కాహ్వానములోనూ
ఉర్వీ శాంతి సముపార్జన లోనూ
ఉడుతా భక్తిగ పాల్గొంటాం........................ // వి //

# జానపద సంక్రాంతి ( 1,2 )

తొంగోకురోరన్న తొలి కోడి కూసింది
సంకురేతిరి వచ్చి సరదాలు తెచ్చింది.

గుమ్మడి పూలెట్టి గొబ్బెమ్మలుంచారు
ముగ్గుల్లో గొబ్బిళ్ళ ముచ్చటగ నిలిపారు . // తొ //

భూమినే నమ్మితే బువ్వకు – లోటేటి ?
పంట పండిందంటె బాధలే తీరేను. // తొ //

అటు చూడు చలి మంట – ఇటు చూడు తొలిపంట
చలి కాగి ఎచ్చంగ సంబరము చేతాము // తొ //

## 2

ఏడాది కొక పాలి ఎగిరొచ్చి వాలింది
ముంగిట –సంకురేతిరి పండగా
ముగ్గుల ముత్యాలు నిండగా................. // ఏ //
ఉడుపుకోతలతోనె ఉక్కిరి బిక్కిరయి
భూమినె నమ్ముకున్న రైతుకూ
పొంగలి తిన బెట్టె పండగా.................... // ఏ //

గజ్జెలు మువ్వలతో గంగడోలూగించి
ఇంటింట బసవన్న తిరిగీ –
ఇద్దెలు చూపేటి పండగా // ఏ //

చలి మంట లేసుకుని – సరదాలు చేసుకుని
కష్టాలు మరచేటి రైతుకూ
కాసింత నవ్వుల పండగా // ఏ //

( దూరదర్శన్ సౌజన్యంతో )

# చిన్న కుటుంబం

చిన్న కుటుంబమె ఇలలో
సిరులొలికే స్వర్గం
రానున్న తరాలకదే
రమ్యమైన మార్గం // చి //

పరస్పరం గౌరవించు
పతిపత్నుల వలపులలో
సమభావమె ఊపిరిగా
ఉదయించిన శిశువులతో // చి //

ఆగర్భంగా పిల్లల
కరిష్టాలు సోకనీక
కంటి రెప్పలై పెంచే
కన్నవారి రక్షణలో // చి //

ఆడబిడ్డ మగ శిశువని
తేడాలే లేకుండా
రెండు కళ్లుగా బ్రతుకును
పండించిన బాటలో // చి //

# ధర్మ కర్తలం

ఈ గాలీ ఈ నీరూ
ఈ కానలు కోనలు
ఈ తరువుల నీ వనరుల
వెలకట్టగ తరమా ? || ఈ ||

ధరలో సిరి సంపదలకు
ధర్మకర్తలం మనం
వృధా చేసి తరలి పోవు
అధికారం మనకు లేదు................. || ఈ ||

మిన్నగ మన కన్నా రా
నున్న తరం బ్రతకాలోయ్
మన మిచ్చిన వారసత్వ
ఫలము లనుభవించాలోయ్............. || ఈ ||

విలువైనది జీవితమను
ఎరుకను కలిగించేలా
సమతా మమతా స్నేహం
సౌజన్యం పంచవోయ్!............................. || ఈ ||

# కొనుగోలు

ప్రయాసపడి సాధించిన
ప్రతి పైసా నీదే
వినియోగించేటప్పుడు
విలువను రాబట్టు..................... // ప్ర //

కొలతల్లో తూకంలో
కుటిలత్వం చూపించే
అమ్మకాల వెనుక నున్న
అన్యాయం చూడు................... // ప్ర //

అమ్మేవాడి దురాశను
అరికట్టే లక్ష్యంతో
మనకున్నది చట్టమన్న
మాట మరవ వద్దు.................. // ప్ర //

దోపిడీకి మోసానికి
దొరకని మార్గంలోనే
అంగడిలో సరుకులు కొని
హాయిగ బ్రతకాలి................ // ప్ర //

# మంగళం

భరతావని నీ కివిగో మంగళ హారతులు
జనయిత్రీ నీ కివిగో కర్పూర హారతులు // భ //

స్వతంత్ర భారత సాధనకోసం
శాంతి సమరమును నడిపిన తల్లివి // భ //

ప్రపంచ శాంతికి పరమత సహనమె
బంగరు బాటగ తెలిపిన తల్లివి // భ //

గౌతమ బుద్ధుని కమ్మని పలుకులు
జగతి జనులకందించిన తల్లివి // భ //

రాజ్యకాంక్షతో పరుల నేలపై
దండయాత్రలే ఎరుగని తల్లివి // భ //

వీరవనితలకు ధీరమాతలకు
నిష్ఠను - దీక్షను నేర్పిన తల్లివి // భ //

త్యాగశీలురకు యోగపురుషులకు
ప్రేమతో ఊయల లూచిన తల్లివి // భ //



ఈ రచయిత ప్రచురించిన మొదటి పుస్తకం

## గిడుగు రాజేశ్వర రావు కథలు

(నవంబరు -1990)

సంపుటిపై ప్రముఖుల అభిప్రాయాలు

★ గిడుగు రాజేశ్వరరావు కథలు నేల విడిచిన సాములు కావు సరికదా నేలను అంటి పెట్టుకొని మీరు పెరికి వేద్దామని ఎంత ప్రయత్నించినా నేలలో బలంగా పాతుకు పోయాయి. సారళ్యం, మాధుర్యం ఆయన కథల్లో ఉంది. సాదాగా సాగుతూ సెలయేటి ఊటలా పుట్టిన సందేశాత్మక కథలివి. సహజత్వానికి దగ్గరగా వుంటూ ఉపదేశాత్మకత వైపు పోకుండా సన్నివేశాలే మనకు పాఠం చెబుతాయి.

*జ్ఞానపీఠ అవార్డు గ్రహీత, పద్మభూషణ్ - ఆచార్య సి. నారాయణ రెడ్డి*

( 8-1-91న ' రంజని ' నిర్వహించిన సభలో ' గిడుగు రాజేశ్వరరావు కథలు ' ఆవిష్కరిస్తూ అన్న మాటల్లో కొన్ని )

★ వీరి కథలన్నీ నిసర్గ సుందరంగా వుంటాయి. ఈ కథల్లో జిత్తులు, యుత్తులు, గమ్మత్తులనేవి వుండవు. వ్యథార్థ జీవుల యదార్థ గాథలను చెప్పడానికి ప్రయత్నం చేసిన వాస్తవిక దృక్పథం గల కుటుంబ కథా రచయిత అనిపిస్తారు. ఈయన కథలు చదువుతున్నపుడు కలిగే సుఖం ఏమిటంటే అవి ఎవరి రచనకూ ప్రతి ధ్వనులు కావు. ఈయనలో emotion, passion కంటే జడ్జిమెంట్ అధికంగా వున్నందున సన్నివేశాన్ని analyse చేసి చూసే స్వభావం ఎక్కువగా కనిపిస్తుంది. ఈ గిడుగు వారి కథలు చదివితే మనస్సు స్వచ్ఛమవుతుంది. లోపల చిన్న దీపం వెలిగించినట్లు జ్ఞానం ప్రకాశిస్తుంది. మంచికి దగ్గరవుతాము.

*- పురాణం సుబ్రహ్మణ్య శర్మ*

( కథా సంపుటికి రాసిన ముందు మాట నుంచి)

★ గిడుగు రాజేశ్వరరావుగారు మంచి కథకులనీ, వీరి కథలు కథా సాహిత్యంలో విలువైనవనీ ఈ కథా సంపుటి వల్ల చెప్పవచ్చు. ఈ కథా సంపుటిలో గల ఇరవై కథలలో ఏడు కథలు వివిధ పోటీలలో బహుమతులు పొందాయి. ఈ కథలలో మనసు కథలున్నాయి. సామాజిక కథలున్నాయి. సమస్యల్ని చర్చించే కథలున్నాయి. ఒక ఇజానికి ' కమిట్ ' కాని విశిష్ట కథా రచయిత కథలు ఎలా వుంటాయో ఈ కథా సంపుటి తెలియ జేస్తుంది. మనం గుర్తించని.

గుర్తించినా నిర్లక్ష్యం చేసే విలువైన మానవ అంశాల్ని రాజేశ్వరరావు గారు ఇతి వృత్తాలుగా స్వీకరించి తమ లోకానుశీలనా గుణాన్ని చాటుకున్నారు.

– ద్వా.నా. శాస్త్రి

( 12- 8- 91 నాటి ఆంధ్రజ్యోతి దినపత్రికలోని సాహిత్యవేదికలో )

★ చక్కని శైలితో సూటిగా సరళంగా సాగిన ఈ కథలన్నీ బాగున్నాయి. కథలంటే ఇష్టం కలవారు హాయిగా చదువుకోగల పుస్తకం.

– స.రా.

( ఈనాడు – ఆదివారం, 10–3–1991)

★ గిడుగు రాజేశ్వరరావు గారు తెలుగు కథకు పాత పరిచితులే అయినా కిందటి దశాబ్దిలో మాత్రమే ఆయనకు చురుకు పుట్టింది. కనుక, జీవితాన్ని గురించి అవగాహనా, రచనా సామర్థ్యమూ రెండూ ఆయన కథల్లో కనిపిస్తాయి. గాఢమైన అనుభూతి నిచ్చే కథలు

– పోరంకి దక్షిణామూర్తి

( ఆంధ్రప్రభ సచిత్ర వార పత్రిక, 2–10–1991)

★ కుటుంబ సమేతంగా చూడదగిన సినిమాలు కరువవుతున్నట్లుగానే ఇంటిల్లిపాదీ చదివి, చర్చించుకో గలిగిన కథలు నల్లపూసలైపోతున్నాయి. సామాన్య ప్రజానీకం హృదయాంతరాళాలలో పశు ప్రవృత్తిని మేల్కొలిపి సమాజాన్ని విధ్వంసం వైపు, భయోత్పాతం వైపు మళ్ళించడమే ప్రస్తుత కథా వస్తువుల ప్రాథమిక లక్షణమైపోయింది. కథా ప్రపంచం అటువంటి స్థితిలో విల విలలాడుతున్న తరుణంలో గిడుగు రాజేశ్వరరావు వంటి కథకులు పుట్టుకు వస్తూనే ఉన్నారు. ఒయాసిస్సులా సేదదీరుస్తూనే ఉన్నారు. గిడుగు రాజేశ్వరరావు తన కథల్లో ఆడంబరాలు. అశ్లీతల జోలికిపోలేదు. మిర్చి మసాలాలను రంగరించలేదు. వాస్తవికతకు, సహజత్వానికి దూరం కాలేదు.

– మల్లంపల్లి ధూర్జటి

( ఏప్రిల్ 21–5మే,1991, ఇండియా టుడే )

★ ఆయన కథలు ఉన్నత ప్రమాణాలు నింపుకుంటాయి. ఇది పాఠకుల్ని బాగా ఆకట్టుకొనే కథా సంపుటి .

– గోవిందరాజు రామకృష్ణారావు

**ఆకాశవాణి – హైదరాబాద్ ' ఎ '( 26- 1-1991 పుస్తక సమీక్ష )**



గిడుగు రాజేశ్వర రావు లలితగేయ మాలిక

# రాగ వీచికలు

( జూన్ - 1992 )

★ శ్రీ రాజేశ్వరరావు గారి గేయకవితా సంపుటి 'రాగవీచికలు ' నాకు చాలా సంతృప్తిని కలిగించింది. గిడుగువారి వంశం అంతా సంగీతసాహిత్యాలకు పుట్టినిల్లు. అదే వంశీయులైన గిడుగు రాజేశ్వరరావుగారి పై కూడా ఆ వంశపు సువాసనలు విరజిమ్మాయని చెప్పొచ్చు. వీరి ప్రతీ రచనలోనూ ఒక ప్రత్యేకత గోచరిస్తూ వుండి పాడేవారికీ, వినేవారికీ, చదివేవారికీ కూడా చక్కని రసాను భూతిని కలుగ జేస్తుందని చెప్పక తప్పదు.

– *శ్రీరంగం గోపాలరత్నం*

( 'రాగవీచికలు ' లలిత గేయ మాలికకు రాసిన ముందుమాటనుంచి)

★ ' రాగవీచికలు' లో రచయిత సహజమైన ధోరణిలో పల్లవికీ చరణాలకూ continuity of thought నిలుపుతూ, సక్రమ బద్ధమైన భావుకతతో సుమధురమైన గేయాలను రచించారు. మంచి పదజాలమూ, యతీ, ప్రాసా మొదలైనవి రచనకు అందమైన ఆభరణాలు. ఈ విషయాలన్నీ మరుగైపోతున్న ఈ రోజుల్లో వీటిని పాటిస్తూ సహజమైన , సున్నితమైన భావాలతో చక్కని గేయాలు రచించారు రాజేశ్వరరావు గారు.

– *మహాభాష్యం చిత్తరంజన్*

( ' రాగవీచికలు ' కావ్యానికి రాసిన పీఠిక నుంచి)

★ శ్రీ గిడుగు రాజేశ్వరరావు గారి రాగవీచికలు చల్లగా కమ్మతెమ్మెరలాగ, మంచి పువ్వు తావిలాగ పలకరిస్తాయి. ఆయన మంచి భావుకులు, మాట ఉల్లాసంగా ఉంటుంది. చిట్టిపొట్టి మాటలతోనే ఆగేయాల పచ్చనాకుల బొమ్మరిల్లు ఆయన కట్టారు. మళ్లా మీ పసితనాన్ని ఒకసారి అనుభూతిలోకి తెచ్చుకోవటానికి ఈ గేయాలను ఆహ్వానించండి. ఆలాపించండి. కోకిల కుహూకుహూరవం, శ్రావణమాసపు సంధ్యారాగం, చామంతుల వివర్తశోభలు, మల్లెపూల మనోజ్ఞదరహాసాలు, వెన్నెల చాలులు, ఒప్పుల కుప్పలాటలు, ఎండవానల పొలిమేరలలో ఇంద్ర ధనుస్సులు, తల్లి సందిటా, తండ్రి కౌగిటా, శిశుహాసోజ్జ్వల చిరంతన దృశ్యాలు ఒకసారి చూద్దామని, విందామని, కుతూహలం కలిగితే ఈ పాటలు పాడుకోవటానికి , ఆడుకోవటానికి బాగుంటాయని మీరే అంటారు.

– *మంజుశ్రీ*

( రాగవీచికలు కావ్యానికి రాసిన ' అభిప్రాయం ' నుంచి)



వీరి మూడో కావ్యం, రెండో కథల సంపుటి

# కాళిందిలో వెన్నెల

( ఏప్రిల్ -1995 )

★ చక్కగా కథని చెప్పడం రాజేశ్వరరావుగారికి బాగా వంట బట్టింది. ఎలాటి ప్రయత్నమూ లేకుండా అలవోకగా కథ చెప్పగల నేర్పు ఉంది. ప్రారంభమూ ముగింపూ అత్యద్భుతంగా, అసాధారణంగా, పాఠకుడ్ని ఆశ్చర్య చకితుడ్ని చేసే విధంగా వుండాలన్న నియమమేం లేదు. అలా లేకపోయినా మంచి కథలు రాయొచ్చని నిరూపించే కథలే ఈ సంపుటిలో ఎక్కువ. ఈ కథల్లో మానవీయ సంబంధాలకు ప్రాధాన్యం ఇచ్చారు.

– *శీలా వీర్రాజు*

( 'కాళిందిలో వెన్నెల' కి రాసిన ముందుమాట నుంచి )

★ మనం ఊపిరి పీల్చినంత సుఖంగా , నిసర్గ రమణీయంగా, అలంకారాల బలాత్కారాలు లేకుండా, మధ్య మధ్య ప్రవచనాలు లేకుండా, అన్యవిషయవ్యాఖ్యలు లేకుండా సాగే కథలివి. రాజేశ్వరరావు కథతో పాటు తాను నడుస్తాడు. కథను నడిపిస్తాడు, కానీ కథలో తాను కనిపించడు కథలో అందరి జీవితాలు కనిపిస్తాయి. మనకు తార సిల్లే పాత్రలు కనిపిస్తాయి. కథ అంటే అలా ఉండాలి అని చెప్పేంత అందంగా రాశాడు.

– *ఆచార్య సి. నారాయణ రెడ్డి*

( 16–6–1995న జరిగిన సభలో '' కాళిందిలో వెన్నెల '' ఆవిష్కరిస్తూ చేసిన ప్రసంగం నుంచి )

★ ఆర్ద్రతాస్వరం రాజేశ్వరరావు రచనల్లో బలంగా ఉన్న ఒక వస్తువు. వ్యక్తిలోరావలసిన మౌలికమైన సంస్కారం పైన్నే ఈరచయిత దృష్టిసారించాడు. వీరి కథల్లో జీవిత చిత్రాలు, జీవిత శబ్దాలు పుష్కలం. ఈ కథలు మన సంస్కారానికి పదును పెడతాయి.

– *శ్రీపతి*

( 16–6–1995న జరిగిన సభలో ' కాళింది వెన్నెల ' పై చేసిన సమీక్షనుంచి.)

★ గిడుగు రాజేశ్వరరావు కథల్లో కల్పన పాలు తక్కువ. అన్నీ నిజంగా జరిగే ఉండవచ్చునని అనిపిస్తుంది. ఇతివృత్తాలను నిత్యజీవితంలో నుంచి తీసుకోవడంతో పాటు వాటిని డ్రమటైజ్ చేయకుండా, ఏ విషయాన్నీ నొక్కి చెప్పకుండా, సాదా సీదాగా చెప్పుకుంటూ పోవడం వల్ల కూడా

ఆ కథలన్నీ నిజంగా జరిగే ఉండవచ్చుననే భ్రాంతి కలుగుతుంది. అండర్ స్టేట్మెంట్ ఈ కథల్లోని ప్రత్యేకత.

*– నండూరి రామమోహనరావు*

( ఇండియాటుడే, సెప్టెంబర్ 6–20, 1995)

★ మానవ సంబంధాలకు మరో భాష్యం ' కాళిందిలో వెన్నెల '. ఇందులో కథలన్నీ ఆత్మాశ్రయధోరణిలో, ఉత్తమ పురుషలో సాగుతాయి. భాషలోని జీవశక్తి మూలంగా, సంభాషణలు నడపడంలో ఉన్న ప్రజ్ఞమూలంగా, వాతావరణ చిత్రణలో ఉన్న ప్రతిభవల్ల సునాయాసంగా కథనం చేయగలిగే నైపుణ్యం మూలంగా ఇవన్నీ ఆకర్షణీయమైన కథానికలు కాగలిగాయి.

*– అమ్మంగి*

( ఆంధ్రప్రభ దిన పత్రిక ' సాహితీ గవాక్షం '– 3–3–1996)

★ ప్రిజమ్ లాంటి జీవితంలో వేర్వేరు కోణాల్ని ప్రదర్శించ గల సత్తా మధురాంతకం రాజారాం, వాకాటి, విహారి, బలివాడకాంతారావు వంటి కొద్దిమందికే ఉంటుంది. గిడుగు రాజేశ్వరరావు గారు ఆ కథకుల కోవలోకి చెందుతారు. వీరి కథలు సాదాగా కనిపించి తమ లోతును కనుక్కోమంటాయి. కథకి, పాత్రలకి సంబంధించిన వాతావరణాన్ని సృష్టించడంలో కథకుడి నేర్పు వెల్లడవుతుంది.

*– డాక్టర్ ద్వా.నా.శాస్త్రి*

( ఆంధ్రప్రభ సచిత్రవారపత్రిక 1–7 నవంబరు ,1995 )

★ ఈ కథలన్నీ లోతులకి వెళ్లి మానవసంబంధాలలో పోయిందేమో అని భయపడుతున్న మమతను, మంచిని వెలికి తీసుకువచ్చి మన అందరి చేతా దర్శింప చేస్తున్నాయి. ఈ కథలు చదువుతూ ఉంటే కథలలోని పాత్రలు వారి మంచితనంతో మమతతో ప్రపంచాన్ని అర్థం చేసుకునే మంచి హృదయాన్ని మనకి అలవాటు చేస్తున్నాయి.

*– వాడ్రేవు వరలక్ష్మీ దేవి*

( ఆహ్వానం, మాసపత్రిక, సెప్టెంబరు 1995)




వీరి నాలుగో కావ్యం, మూడో కథల సంపుటి

# పూలతేరు

( ఏప్రిల్ -2000 )

గిడుగురాజేశ్వరరావు కథలు పాఠకులకు జీవితం పట్ల ప్రేమకలిగిస్తాయి. సమాజం పట్ల అనుబంధాన్ని ఏర్పరుస్తాయి. సిమెంటు గోడలమధ్య, నట్టింట్లో కొలువైన పంచరంగుల స్వప్నాల మధ్య చేరి, పక్కవారి గురించి పట్టించుకొలేని మనకు మనిషి వాసన తెలుపుతాయి. ఒక మనిషికి మరో మనిషి ఎంత అవసరమో గుర్తించేలా చేస్తాయి. ఏ కథను కదిపినా మనిషివాసన కొడుతుంది. ఏ అనుభవాన్ని మీటినా జీవనగమకమే వినిపిస్తుంది.

వితంతు వివాహనేపథ్యం లోంచి జీవితం ఒకవరం, జీవించడం ఒక కళ అని స్పష్టంచేసే కథ **"పూలతేరు "**. ఈ కథలో వితంతు వివాహం అన్న విషయం తరచిచూస్తేనే కానీ అర్థంకాదు. కథానాయకుడి జీవితంలో సంస్కరణ చాలా సహజంగా ఒదిగిపోయింది. దాన్ని సంస్కరణ అనడానికి కూడా వీల్లేదేమో !

రైలు ప్రయాణంలో మరణం సంభవిస్తే, ఎంతసంకటమో తెలిపే కథే **"మౌనయానం "** కొడుకు చనిపోయినా గమ్యంచేరేవరకు ఆబిడ్డ జీవించి ఉన్నట్లే నటిస్తూ ఆ బిడ్డ తల్లి అనుభవించిన వ్యథ వర్ణనాతీతం. సమాజంలో ఇంకా రాజ్యం చేస్తోన్న మూఢ విశ్వాసాలు సంకుచితత్వానికిది నిదర్శనం.

నమ్మిన సిద్ధాంతానికి జీవితాంతం కట్టుబడిన వ్యక్తికథే **"పూర్ణమిదం తాతగారు "** మానవసంబంధాల్లోని అరుదైన కృతజ్ఞత, మానవీయత, అద్వైత తత్త్వానికి అక్షరరూపం**" అపురూప సందర్శనం"**. భయమా, ప్రేమా ఏది ప్రవర్తనను నియంత్రిస్తుందో తెలిపేకథ **"అలౌకికం"** . ఏ మబ్బు ఎక్కడ వర్షిస్తుందో ఎందుకు వర్షిస్తుందో, **"మొబిలిటీ "** ద్వారా మానవుడు సాధించిన ప్రస్థానం ఏమిటో వివరించేది **"ఎక్కడిమబ్బు – ఎక్కడి వాన"**. చిలుక,స్వేచ్ఛను వదలుకొని ప్రేమని ఎందుకు కోరుకుంటుందో**"పంజరం నచ్చిన చిలుక"** కథలో తెలుస్తుంది.నవనాగరికత ప్రభావం వల్ల ఉన్న ఇంటిని అమ్మి ఫ్లాట్ కొన్న తర్వాత తాము పోగొట్టుకొన్నదేమిటో తెలుసుకొని, చేతులు కాలాక ఆకులు పట్టుకొనే సామెతలా వగచిన జీవితమే **"గుప్పెడు ఆకాశం"**.కేదార్‌నాథ్ ప్రాంతాల్లో ప్రయాణీకుల్ని చేరవేసే గుర్రాల పట్ల యజమానులు ఎలా ప్రవర్తిస్తారో ఓ గుర్రం అంతర్మథనం **"కన్నీటిలో పన్నీరు "**. వాస్తు జీవితాలను ఎలా శాసిస్తోందో తెలిపేకథ **" క్రీనీడ "**.మనుషులకన్నా

జంతువులే నయమనిపించేది 'నిడలో నిరీక్షణ". సరిహద్దుల రక్షణలో చీకాకులనుభవిస్తున్నా చెరగని నవ్వుతో జీవిస్తోన్న వారికథే"స్మితయోగులు".ధనార్జనలో విద్యాసంస్థలు విలువలకు తిలోదకాలిచ్చిన వైనం తెలిపే కథ"**మార్గర్శులు**".

"**పూలతేరు**" లో రచయిత తనకు తెలిసిన ; తాను చూసిన, అనుభవించిన జీవితాన్ని గురించి మాత్రమే రాశారు. సమాజంలో సహస్రముఖాలతో కనిపిస్తోన్న హింస, అధికారదాహం, స్వార్థం ఈ కథల్లో కనిపించకపోవడానికి ప్రధానకారణం రచయిత తనకు తెలిసిన జీవితాన్ని గురించి మాత్రమే రాయాలని తనకు తానుగా విధించుకొన్న నిబంధనే. అందుకే ఈ కథలు చాలా సింపుల్‌గా ఉన్నట్లనిపిస్తాయి. కానీ పాత్రల స్వభావం, గాఢమైన వాతావరణం ఇవన్నీ మనల్ని నేపథ్యంలోకి తీసుకెళ్లి ఆలోచింపచేస్తాయి. వివరణాత్మకశైలి కారణంగా గిడుగు రాజేశ్వరరావు ఈతరం కథకుల కన్నా భిన్నంగా కనిపిస్తారు."కొసమెరుపు " కోసమో, మాటలగారడీ కోసమో రచయిత పాకులాడినట్లు ఎక్కడా దాఖలాలు లేవు. వీరికున్న భాషాసంపద చాలామందికి లేదనడం ఏ మాత్రం అతిశయోక్తికాదు. మంచి రచయితకి భాషపై పట్టుండాలి. అది వీరికుంది. కథ నడిపే తీరు, పాత్రలప్రవేశం, సన్నివేశకల్పన చాలా సహజంగా ఉంటాయి.

– **చీకోలు సుందరయ్య**

అధ్యక్షులు, రంజని

# కృతాజ్ఞతాభివందనాలు

నాచేత ప్రత్యేకంగా గతదశాబ్దినుంచి పాటలు రాయించీ, నేరాసిన పాటలకు సంగీతం సమకూర్చీ, వాటినిపాడీ, సంగీత ప్రియులకు పరిచయం చేసిన మహామహులెందరో. పేరుపేరునా చెప్పడం నిజానికి శక్యంకాదు. అయినా ఆదిశగా నే చేస్తున్న చిన్న ప్రయత్నమిది.

*ఆకాశవాణిలో నిర్మాతలు:* శ్రీయుతులు గోపాలకృష్ణ, ప్రసాదరావు, కొట్రామల్లికార్జున శర్మ, విల్సన్ హెరాల్డ్, శ్రీమతులు తురగాజానకి రాణి, పుట్టపర్తి నాగపద్మిని, వినయమణి, ఉషారాణి, విజయలక్ష్మి, శ్యామసుందరీదేవి,

*సంగీత దర్శకులు:* శ్రీయుతులు పాలగుమ్మి విశ్వనాథం, మహాభాష్యంచిత్తరంజన్, పి.సాయిబాబా, కృష్ణవంశీ, కొచ్చర్ల కోట సూర్య ప్రకాశరావు, కలగా కృష్ణమోహన్, ఎమ్.ఆర్.కె.ప్రభాకర్, జయదేవ్, కె.వి.రామాచారి, సుధాకర్, నిర్మల్‌కుమార్, ఉషాకాంత్, శశిప్రీతమ్, సురేంద్రనాథ్‌కాలే, కృష్ణనీరజ్, దుగ్గిరాల లినోజోసెఫ్ , రామచంద్రరావు, శ్రీమతులు సి.ఇందిరామణి, శిష్ట్లా శారద, శోభారాణి, పి. స్నేహలతామురళి,

*దూరదర్శన్ నిర్మాతలు:-* శ్రీమతులు యమునాసంజీవ్, శైలజాసుమన్, పరిమళ, యార్లగడ్డశైలజ, పద్మావతి, సుశీలానారాయణ,

శ్రీయుతులు వై.నారాయణమూర్తి, ఎమ్.సి.వి.శశిధర్, సతీష్, వేంకటస్వామినాయుడు, టి.డి.కె.చక్రవర్తి,

టెలిస్కూల్ నిర్మాతలు: శ్రీమతి అరుణకుమారి, శిరివోలు రాధాకృష్ణ, బి.యన్.యాదగిరి; అంజిరెడ్డి రాంబాబు, నాయుడు,

ఆంధ్రప్రదేశ్ కుటుంబసంక్షేమశాఖ కమీషనర్ శ్రీ సి.బి.యస్. వేంకటరమణ, మెహర్‌బాబామూవింగ్ మీడియాప్రభృతులకూ,

గాయనీ గాయకులు శ్రీయుతులు శేషుబాయ్, వేదవతీప్రభాకర్, చంద్రకాంత,

ఛాయాదేవి, ద్వారంలక్ష్మి, శిష్ట్లాశారద, శాంతాచారి, రామలక్ష్మీ రంగాచారి, వై.సీతామహాలక్ష్మి,శశికళాస్వామి, ఓ.లీలావతి, బి.విజయశ్రీ,సునీత, విజయలక్ష్మీశర్మ, సి.హెచ్.కృష్ణకుమారి, ఇందిర, సురేఖామూర్తి, రమణకుమారి, విజయలక్ష్మి,విజయలక్ష్మీ దేశికన్, మాస్టర్‌కారుణ్య,

శ్రీయుతులు ఎస్.పి.బాలసుబ్రహ్మణ్యం,మనూ, కె.బి.కె.మోహన్‌రాజు, నరసింహమూర్తి, ఎమ్.ఆర్.కె.ప్రభాకర్, మిత్రా,రామాచారి,షహీద్‌బాబు,జయరామ్, గంగాధరశాస్త్రి కె.యస్.ఆర్.మూర్తి, పి.విజయ్‌కుమార్,జి.లక్ష్మణమూర్తి, కె.వెంకటరావు,మేకలనారాయణ,

శ్రీమతులు చిత్ర, యస్.జానకి, యస్.పి.శైలజ,శారదారెడ్డి ................ వీరందరికీ కృతజ్ఞతాపూర్వక వందనాలు సమర్పిస్తున్నాను.

హైదరాబాద్
**5-5-2000**

– గిడుగు రాజేశ్వరరావు